# నిట్టూర్పులు

ఏడు విషాదాంత నాటికల సంపుటి.

రచయిత :

డాక్టరు రాంబాబు

ఏలూరు.

ముఖచిత్రం :

యం. కోటి

ఏలూరు.

*

ముద్రణ :

జెమిని ప్రింటర్సు

ఏలూరు.

*

ద్వితీయ ప్రచురణ :

జూన్ 1950

వేయి ప్రతులు

*

మూల్యం : ముప్పావలా

*

ప్రతులకు :

డాక్టరు రాంబాబు

ఏలూరు.

△

అంకితం :

క్షయవ్యాధికి బలియైన

నా తమ్ముడు, స్వర్గీయ

కావలిపురపు శ్రీరాములు కు

నిట్టూర్పుతో !

▽

రాలిపోయిన
కళా హృదయాలకు
జోహార్లు !

★ **నాటికలు :**

తాజమహాలు

పాలదొంగలు

అగ్నిగుండం - రక్త సముద్రం!

దీపస్తంభం ఊగులాడుతోంది!

ఒక పగలు + ఒక రాత్రి = అంధకారం

నిండుకుండ తొణికింది!

మహాకవి : జాన్ కీట్సు

△

నాటికలన్నీ స్వతంత్ర రచనలు. అన్ని హక్కులూ రచయితవి. ఈ విషాదాంత నాటికల సంపుటి "నిట్టూర్పు" లోని ఏ నాటికనైనా సరే ప్రదర్శించుట వగైరా చేయ దలచినవారు రచయితయొక్క లిఖిత పూర్వకమయిన అనుమతిని ముందుగా పొందవలయును.

రచయిత :
డాక్టరు రాంబాబు
ఏలూరు

# తాజమహాలు

ఇందలి కథాంశం శ్రీ జి. జాషువ
కవిగారి "ముంటాజిమహాలు"
పద్యకావ్యములోనిది. అందులో
కల్పితమైన ఒకదీనుని కథనుబట్టి
ఈ నాటిక అల్లబడింది; అంతే
గాని చరిత్రాధార మేదీలేదు. తాజ
మహాలుపై ఈ క్రొత్తపూతలకు
మన్నింపగోరుతున్నాను.

పాత్రలు :

విప్రయోగి : కాలీ, శ్మశాన నివాసి

మధుమూర్తి : శిల్పాచార్యుడు

షాజహాను : మొగలు చక్రవర్తి

మంత్రి –

పండితులు –

" ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగున పడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగని సత్యం.....
తాజ్‌మహల్ నిర్మాణానికి
రాళ్లెత్తిన కూలీ లెవ్వరు ?....."

— శ్రీ. శ్రీ.

★

## అమరావతీ గ్రామం :

పూరిగుడిసెముందు భానూదయం విలోకిస్తూ శిల్పి మధుమూర్తి; కౌపీనధారియై ఒకచేత మానవ కపాలం, వేరొక చేత బూడిదతో చేసిన బొమ్మ పట్టుకొని, ఎముకల ప్రోగు విప్రయోగి ప్రవేశం :

విప్రయోగి : భవతి భిక్షాందేహి ! (తనలో- పైకి) బుద్ధుని దివ్యవాణితో పునీతమైన భవ్యభారత భూమిలోకూడా హింస చచ్చిపోలేదు; పరపీడన సమసిపోలేదు ; సత్యం స్థిరంగా స్థాపించబడలేదు; న్యాయం మూర్తీభవించడంలేదు ........ భవతి భిక్షాందేహి !

మధుమూర్తి : (దూరంగాఉన్న విప్రయోగి చేతిలోని బొమ్మచే ఆకర్షింపబడినవాడై) ఓయ్, సన్యాసీ ! సన్యాసీ !!

విప్ర : (సమీపించి) సన్యాసిని కాను; శ్మశానవాసిని.

మధు : అయితే యోగివా ?

విప్ర : యోగినికాను; వియోగిని.

మధు : వియోగివా ?...

విప్ర : అవును ; సతీవియోగిని. ప్రియభార్యా వియోగ పరితప్తుడను. శ్రమజీవుల చిహ్నాన్ని. క్షుద్బాధా పీడితుడను...(కంటికొలుకుల్లో నీరునిండును)భిక్షాందేహి!

మధు : పాపం! దుఃఖించకు. కూర్చో. (విప్రయోగి కూర్చుంటాడు) కష్టసుఖాలు కావడికుండలు... ఆ బొమ్మ ఏమిటి?

విప్ర : (మౌనం)

మధు : నేను చూడవచ్చునా ?

విప్ర : (బొమ్మను ఇస్తాడు)

మధు : (తన్మయత్వంతో) దివ్యంగాఉంది; దీనిని—

విప్ర : (అర్ధోక్తిలో-) ఇయ్యను. అది అమరణమూ నన్ను సేవించి అలసిన నా అర్ధాంగి స్మృతిచిహ్నం! నా ప్రియచిహ్నం పసిడిరేకులపై చిత్రించుకొనేవరకు విడిచి ఉండలేను.

మధు : (బొమ్మను తిరిగిఇచ్చివేసి) అవును. భగ్నహృదయుడవులా వున్నావు.

విప్ర : శ్రమపీడకుల్లు భక్షించగా మిగిలిన పిపీలికాన్ని. తన మహాదాశయాలనే నీడలో ఎల్లవేళల నన్ను సేదదీర్చిన నా అర్ధాంగి స్మృతిచిహ్నాన్ని విడిచి క్షణ ముండగలనా ? ... ఆకలి !

మధు : ఉండు. పళ్లున్నాయి; తెస్తాను. (లోనికి వెడతాడు)

విప్ర : (తనలో – పైకి) బ్రతికి సజీవంగా వున్నప్పుడు కాపాడలేని ఈ పాడులోకం చిదికి చివికిపోయాక స్మృతిచిహ్నాలను చూచి ఆనందిస్తోంది.

మధు : (నాల్గరటిపళ్ళు తెచ్చియిస్తూ) నీవు శిల్పివా ?

విప్ర : నేను శిల్పిని ఎలా కాగలను ? ఎన్నాళ్ళు అభ్యసిస్తే ఈ ఎముకల చేతినుండి రేఖ ప్రవహించ గలదు ? శిల్పిని కాను; మానవులు కరకు నేలల నడిచి అలసి పోకుండా మెత్తటి దారు లేర్పరచడానికి రాళ్ళుకొట్టే కూలీని. భోగలాలసులకు దివ్యహర్మ్యాలు నిర్మించి వారు హాయిగా నిద్ర తూగడానికి మా నరాలతో ఊయలలు కట్టే కూలీని. నిరంతర క్షుద్బాధా పీడితుడనైన నాలో శిల్పలక్ష్మి వుంటుందా ? అది మా కళ్లనైనా పడుతుందా ?

మధు : శిల్పం – చిత్రకళ కేవలం అభ్యాసంవల్ల అలవడేవికావు. అనుభూతి, ఆవేశం నుండి పుట్టిన కళలే ఉదాత్తంగా ఉంటాయి. నీ హృదయం ఎంతో దివ్యాను భూతితో నిండాని ఉంటేనేగాని ఇలాంటి చిత్రాన్ని నిర్మించి ఉండవు.

విప్ర : ఎన్నో రాళ్ళను పెకలించిన ఈ మొరటుహస్తాల్లో శిల్పసుందరి వుంటుందా? ఈ పేదవాని శుష్కహృదయంలో కళాసరస్వతికి స్థానమున్నదా ? ప్చ్ (పళ్ళు తింటుంటాడు.)

మధు : కళ ఒకరిసొమ్ముకాదు... నీవీ బొమ్మను ఎలాచేయగలావో – అసలిదేమిటో తెలిపిచెం. చెప్పగలవా ?

విప్ర : ఇది నా నయనాల్లో దాగిఉండి ఆనంద పీయూషాన్ని అందించే నా అర్థాంగ సుందరి స్మృతిచిహ్నం. పొట్ట నింపుకోలేని యీ దీనుడు యీ ట్రి బొమ్మను పసిడిబొమ్మగా చేసుకొని ఎన్నటికైనా ఆనందించగలడా? కల! స్వాప్నిక జగత్తు. గాలిమేడల్లో విహారం! దీన్ని పసిడిబొమ్మగా చేసుకోగల భాగ్యశాలినే అయితే నా ప్రియురాలినే ఆ కిరాతుని నుండి కాపాడుకొనగలిగేవాడిని ...
(అశ్రువులు రాల్చుతాడు)

మధు : (ఆశ్చర్యంతో) ఏ కిరాతుడు? అంత దురాగతమా?

విప్ర : నిండు చూలాలు! సుందర సురభిళ, సౌకుమార ప్రసూనమును ప్రసవించునో; దాస్యజీమూతాళి చెండాడు వీరుని కనునో! ... మా శ్రమధనంతో తులుకు మాయజమాని కామవాంఛకు బలిఅయింది. దుర్మార్గుడు తన గ్రుడ్డికోరిక తీర్చలేదని చెరబట్టి రెండు హృదయాలను బలిగొన్నాడు. ఎవరి శ్రమతో తన భార్యా బిడ్డలకు నిలువెల్ల బంగారు తొడవులు చేయించుకొన్నాడో; ఎవరి శ్రమతో తన జీవితాన్ని నిశ్చింతగా - అభేద్యంగా - చేసుకొన్నాడో ఆ శ్రమజీవుల అంశాంశాన్ని, నాప్రియురాలినీ, వంశాంకురాన్నీ బలిగొన్నాడు. ఆ సుమధురభాషిణీ హృదయ వైశాల్యాన్ని కొలవలేను. ఆమెను క్షణంమరచి అడుగు వేయలేను. ఆమె దివ్యస్మృతిగా బూడిదతో చేసుకొన్నదే ఈ బొమ్మ!
(అశ్రుపూరితనయనాలు అద్దుకొంటాడు.)

మధు : (ఆర్ద్రమనస్కుడై) ఏడవకు! నీ సుందర సతీ వియోగ బాధను నీ శిల్ప సౌందర్యాన్ని చూచి మరచిపో. శ్రమికుని సౌందర్య కళాహృదయ ప్రతిబింబంగా వెలసిన ఈ బొమ్మను, చూచి నీ కష్టాల్ని అధిగమించు.

తెరలో చాటింపు :

"సమస్తమైనవారికి తెలియగలందులకు తెలియపరచే దేమనగా, షాజహాన్ పాదుషా తన ధర్మపత్ని ముంతాజ్ మహారాణి స్మృతిచిహ్నంగా అందమైన సమాధిని నిర్మిస్తారు. అందుకుగాను మచ్చుబొమ్మలను ఆహ్వానిస్తున్నారు. మెప్పు వడసిన శిల్పులకు భూరిబహుమానము లీయబడును."

విప్ర : పాపం! షాజహానుకూడా నావలె వియోగదగ్ధుడా?

మధు : (క్షణమాలోచించి, మందస్మిత వదనంతో) నేటికి నీ స్వాప్నికజగత్తు సత్యమయ్యే సమయం వచ్చింది. నీ భార్యా స్మృతిచిహ్నం భారతీయ కళాభరణం

కానున్నది. శ్రామికుల శ్రమ అజరామరమని చాటే అవకాశంవచ్చింది. నీ కళా హృదయం విశ్వసన్మానం తప్పక పొందితీరుతుంది.

విప్ర : అసంభవం ! అనుక్షణ క్షుద్బాధాపీడితుడు ఈ విప్రయోగి ఎక్కడ? నిరంతర దివ్యభోగాను రంజితుడు షాజహానుపాదుషా ఎక్కడ ? నను మెచ్చి మేలిమి కప్పునా ?

మధు : ఆఁ ఏలకాదు ? నాకా నమ్మకముంది. షాజహాను సౌందర్యపిపాసి ; ఆ హృదయం కళానిలయం ! నన్నునమ్మి నావెంట రా.

విప్ర : నా శ్మశాన నివాసంలోనే కనకహర్మ్యాలను తిలకించే నాకు రాజహర్మ్యాలెందుకు ? (నవ్వి) ఈ ఎముకలప్రోగు గోచిపాతరాయుడు, ఆ మహీపతీ కనకాంబర వస్త్రరోచిస్సుల దరిచేరగలడా ! సదాశయా ! నన్ను మన్నించు. నే కల్పించుకొన్న ఆనందలహరిలోనే నన్ను తేలిపోనీయి. సత్యజగత్తుకూ, నాస్వప్న జగత్తుకూ చాలా అంతరముంది.

మధు : కాదు, కాదు. నీతోటి శ్రామికులనందరినీ ఆనందతన్మయుల్ని చేసే ఈ అవకాశాన్ని జారవిడువకు. కార్మికుల కళాహృదయాన్ని ప్రపంచానికి ప్రదర్శించే అదనును పోగొట్టుకోకు. అప్పుడు నీ ఆనందం శాశ్వతం కాదా ? ఈ నీ కళ - శిల్పం - దేశదేశాల జోహారు లందుకొంటుంది. ఇంతకుమించి నీవు కల్పించుకొన్న ఆనంద లహరిలో దనియగలవా ? నమ్మి నావెంట రా.

విప్ర : మీ సదాశయాన్ని కాదనలేను.

—తెల్లతెర ఆనందంగా జారుతుంది.

# 2

## షాజహాను రాజభవనం - కొలువు :

మంత్రులు, పండితులు, శిల్పులు, సేవకులు ఉంటారు. శిల్పుల సమీపంలో వివిధ విధాల మచ్చుబొమ్మ లుంటాయి.

షాజహాను : (దీర్ఘంగా పరికించి) కృతులంది స్వర్గానికిపోవడం మనవిధి కాదు ; స్వర్గాన్ని ఈ బాధితలోకసామీప్యానికి తేవడం మనబోంట్లు చేయవలసిన పని.

మంత్రి : చిత్తం ! స్వర్గాన్నిచూచిన ఆనందం సౌందర్యోపాసకులైన సార్వభౌములకు కాని ; సామాన్యులకా ? వాళ్లకు ఆనందమిచ్చేవే లేవు.

షాజ : ఈ విషయంలో మన పండితుల అభిప్రాయాలు వాంఛనీయం.

1-వ పండితుడు : జనపతి బాధితలోక మనగా అమాత్యులు సామాన్య ప్రజానీక మంటున్నారు. (అందరూ నవ్వుతారు)

2-వ పండితుడు : (హఠాత్తుగా) మధుమూర్తి ఒక శ్మశానవాసిని వెంట నిడుకొని రావడానికి పాదుషావారు అంగీకరించారని వినికిడి. అతనిరాక రాజభవనానికి శుభదాయకం కాదు. అధినాథులు ఆ శ్వపచుని రావలదని శాసింప ప్రార్థన!

౩-వ పండితుడు : శాసనపాలురు ఆలసింప దగదు. (పండితుల్లో గుసగుసలు)

మంత్రి : శాంతింపుడు!

షాజ : నా హృదయంలో అందరకూ స్థానముంది. అలాగే ఈ ప్రాసాదంలోకూడా అందరికీ ప్రవేశముంది. అడుగో మధుమూర్తి... (దూరంగాచూచి - సింహాసనం దిగి ఎదురేగుతుండగా-)

మంత్రి : మహారాజా! ...

మధు : (సమీపించి) సాష్టాంగ ప్రణామములు ; కృతజ్ఞతాభివందనాలు !

విప్ర : (ఒకచేత బొమ్మ, మరొకచేత పుర్రె పుచ్చుకొని ఏమీ మాట్లాడకనిల్చుని నలు దిశలూ పరికిస్తుంటాడు.)

షాజ : (విప్రయోగి చేతిలోని బొమ్మనుచూచి ముగ్ధుడౌతూ) నా ముద్దులరాణికి కానుక తెచ్చిన మీకు అభివందనాలు. మహోత్తమ సంస్కృతితో విరాజిల్లిన భరతమాతకు తేజః ప్రసూనాలై వెలసిన మీకు నా కృతజ్ఞత !

మధు : పాలకులు! నేనంతటి పొగడ్తకు తగను. (విప్రయోగినిచూపుతూ) ఈ ప్రపూర్ణ కళాహృదయుడు తమ ప్రేమార్ద్రదృష్టులు బరపదగిన ఈ స్మృతిచిహ్ననిర్మాత! (విప్రయోగినుండి పుచ్చుబొమ్మను షాజహానుకిచ్చి) నమస్కృతులు !

షాజ : (బొమ్మను హృదయానికి అద్దుకొని ముగ్ధుడౌతూ) వైరాగ్యపూర్ణమైన ఈ దీనుని హృదయంలో ఇంతటి సౌందర్యలత పూచినదా ? ప్రేమజీవుల ప్రణయ సందేశం ఈ చిత్రంలో మూర్తీభవించి నా ఎడద నిండిపోతోంది. (ఇరువురు ఆగంతకులనూ తీసుకపోయి, ఆ బొమ్మను సింహాసనముపైనుంచి ప్రక్కనున్న ఆసనముపై వారిని కూర్చోబెట్టి తా నాసీనుడౌతాడు.)

౪-వ పండి : భూపాలురు రాజసభామర్యాద లతిక్రమిస్తున్నారు.

షాజ : విశ్వవిపంచిని మీటే కళాహృదయుల్ని సన్మానించడం మర్యాద కాదనడం మానవతగాదు.

౪-వ పండి : షాజహానుపాదుషా ఎక్కడ ? శ్మశాననివాసి ఎక్కడ ? ఇంకదు పండితులకు చిన్నతనమా ? విఖ్యాతులైన ఈ శిల్పులచిత్రా లేమీనచ్చకపోయినా?

సన్యాసుల బూడిదబొమ్మలా తమ్మాకర్షించినవి ? (పండితులంతా తమ కగౌరవ సూచకంగా నిలబడతారు.)

షాజ : శాస్త్రజ్ఞులు క్షమించాలి ! ఈ నా శిథిలహృదయానికి ముంతాజ్ అనితర సౌందర్యం, కళావిలసిత నిర్మల హృదయం, ఈ శిల్పంలో ప్రతిబింబిస్తున్నాయి ; ఆ సుమధుర మంజుల నిక్వాణాలు ప్రతిధ్వనిస్తున్నాయి. నా ముంతాజ్ లలిత వల్లరికి దీనికి సాటిరాగల కానుకేముంది !

=సభలో తిరస్కార సూచకంగా కలకలం=

మధు: పాదుషాల నానందపరచినమా సంతోషం అనంతం! సెలవిప్పించిన వెళ్లివచ్చెదను.

షాజ : (తన రత్నాలహారంతీసి విప్రయోగి మెడలో వేయబోగా, అతను తిరస్కరించగా, పుర్రెలో వేసి) మహాత్మా! మీ కళాహృదయం యమునానది ఒడ్డున పూచి ప్రపంచానికి కళాజ్యోతియై ముంతాజ్ ఆత్మకు శాంతి నిస్తుంది.

: రసికచక్రవర్తీ! నాకీ రత్నాలహారమెందుకు? శ్మశానవాసినైన నాకు, పొట్ట పనిండక కృశాంగుడనైన నాకు, ఈ రత్నాలహార మెందుకు ? తమ ఆనందమే ఈ శ్రమికునకు చల్లదనం.

షాజ : తప్పక నా బహూకరణ స్వీకరించాలి.

విప్ర : రాళ్ళుకొట్టు కూలీకా ఈ రత్నాలమాలలు ! ఈ స్మృతినిర్మాణ ప్రయత్నంలో తిరిగి నే నా రాళ్ళనేమోసి ఆనందిస్తాను. (రత్నాలహారం బొమ్మపై వేస్తాడు)

షాజ : తగదు. తగదు. శీర్ణమైన మనశ్శరీరాలు ఇక సౌందర్యోపాసనచేయాలి.

విప్ర : అవును. కార్మికుల కళాహృదయం మూర్తీభవింపజేసుకొనడమే సౌందర్యోపాసన. అందుకు ఈ శ్రమికుని సేవవలదా ?

షాజ : వలదు.

విప్ర : నే నీ నిర్మాణంలో చేయూత నీయకుండా ఉండలేను. క్షమింపుడు. శ్రమిక హృదయాలకు, గతించిన శ్రమజీవులకు, నా సేవద్వారా జోహారు లందజేయ నీయండి. (సభాభవనమంతా కొంతసేపు నిశ్శబ్దం !)

షాజ : ఓ కళాలక్ష్మీ ! నా ప్రియురాలిలో, ఈ బీదవాని శిథిలహృదయంలో, ఈ అనంతవిశ్వంలో, దృగ్గోచర జగత్తులో, నీవేనా ఉండి ఆనందింప జేస్తోన్నది ? ఓ కళాధిదేవీ ! నీవు లేకపోతే ఈ బాధితలోకం ఎంత ఘూర్ణిల్లేదో !

—గులాబితెర హాయిగా జారుతుంది.

# 3

# యమునాతీరం:

విప్రయోగి అవసానసమయం. స్వచ్ఛశిలాకాంతులతో తేజరిల్లే తాజమహాలు ఛాయల్లో, యమునానదియొడ్డున పూరిగుడిసెలో—

విప్ర : (ఎదుటనున్న మధుమూర్తితో ఆయాసపడుతూ) నాకోరిక ఫలింపజేసిన మీ ప్రతిభకు కృతజ్ఞతాభివందనాలు. తరతరాలుగా శ్రామికుల్ని పీడించేవారితో పాటు వస్తున్న ఈ క్షయవ్యాధికూడా నన్ను భక్షిస్తోంది. నాగుండెలు తినేస్తోంది. పవిత్రోద్రేకాలకు నెలవైన నా హృదయంలో ఈ భయంకరవ్యాధి ప్రవేశించి భక్షింపకముందే నా శ్మశానవాసాన్ని శాశ్వతం చేసుకొంటాను. శ్రమికునిగా రాళ్ళుకొట్టి యజమానుల బొజ్జలునింపినవాణ్ణి కన్నా, ఈ మహత్తర నిర్మాణానికి రాళ్ళుమోయడంలోనే అనిర్వచనీయమైన ఆనంద మనుభవించాను; ఆనందిస్తున్నాను. చాలు ! (పుర్రెను గుండెల మీదుంచుకొంటాడు.) ఇది నా ప్రియురాలి కపాలం. దీన్ని నాతోసాటు సమాధిచేయప్రార్థన ! ఇంతదాకా మీ కీ విషయం తెలుపనందుకు క్షమించండి !

మధు : శ్రమైకజీవీ ! మీ కోరిక విశ్వపూజ్యమైంది. ఈ మహాలు పసిడిరేకులపై చిత్రించవలెననే మీ ఆశ పాలరాతిపై వెలసి కళాలక్ష్మికి నిలయమైంది. ఇందుండి కళాజ్యోతులు ప్రపంచంపై ప్రసరిస్తున్నాయి. కాని మీవలె పూర్తిగా ఈ తాజమహాలు చూచి తనివిదీరనిస్థితిలో షాజహాను కళాహృదయుడున్నాడు ; పాదుషా కడగొట్టుతనయుడు ఔరంగజేబు రాజ్యకాంక్షచే తండ్రిని కారాగారబద్ధుని చేశాడు.

విప్ర : ఆఁ. ఆఁ. విషాదవార్త. ఆ సౌందర్యోపాసికి కారాగారమా ? బాధితలోక సామీప్యంలో స్వర్గం సృష్టించిన మహారాజు నరకప్రాయమైన కారాగారంలో క్రుమ్మగ్గుతున్నాడా ? రాజ్యకాంక్ష చేయని హానిలేదు.

మధు : విచారాలు ఈ సమాజంలో క్షణక్షణ ప్రత్యక్షాలు ... షాజహాను దంపతుల ప్రేమ ఆదర్శమైనది. ముంతాజ్ శాశ్వతమైంది. విప్రయోగీ బాధిత హృదయంలో స్వప్నజగత్తు రూపొంది మణిమయ విలసితమైంది. ఆ తాజమహాలు ద్వారబంధాలు చదవండి : "స్వర్గమనేది ఉంటే అది ఇదే ! నీతిమంతుల విశ్రాంతినికేతనం !" తాజ్ మహల్ !

విప్ర : (మాట్లాడలేని స్థితిలో) అవును. శ్రమికుల హృదయంలో కళ అనేది ఉంటే అది ఇదే! ఇదే శ్రమజీవుల కళాహృదయ ప్రతిబింబం! పారిశ్రామికుల ఘనీభవించిన శ్రమాప్రతిరూప మిదే! కార్మికుల శ్రమచరిత్ర ఇదే! కష్టజీవుల కళానికేతన మిదే! తాజమహాలు !!! (కళ్ళు మూస్తాడు.)

మధు : (అశ్రుధారను వర్షిస్తూ విప్రయోగి నిలువెల్ల నల్లటిగుడ్డ కప్పి కూల్బడతాడు)

—నల్ల తెర నిట్టూరుస్తూ జారుతుంది.

"మతం వేరైతేను యేమోయ్ ?
మనసులొకటై మనుషులుంటే
జాతమన్నది లేచిపెరిగి
లోకమున రాణించునోయ్ !"

—శ్రీ గురజాడ.

△

పాత్రలు :

నందనం : ఫ్యాక్టరీ మేనేజరు కొడుకు
రంగం : ఫ్యాక్టరీయజమానుల తొత్తు ; కూలీ
మంగళం
మంగమ్మ
రంగమ్మ } ఆడకూలీలు
శేషమ్మ
రావమ్మ
చంద్రమ్మ
రఘు : మగకూలీ
మూడు నల్లటి జాతికుక్కలు

# ఫ్యాక్టరీ ఆవరణ:

సాయంత్రం: కూలీలు తొందర తొందరగా ఇళ్ళకు వెడుతున్నారు. ఫ్యాక్టరీ మేనేజరుగా రబ్బాయి-నందనం-గేటువద్ద కుర్చీలో పడుకొని సిగరెట్టుపొగ వదలుతూ, కూలీలను పరిశీలిస్తున్నాడు. అతనికుర్చీ చుట్టూ మూడు నల్లటిజాతికుక్కలు చెలగాటలాడుతూ, కూలీలపై ఎగిరిపడుతున్నాయి.

కుక్కలు : (ఎగిరిపడుతూ) భౌ! భౌ!! భౌ!!!

నందనం : (లేచికూర్చుని, సిగరెట్టుపొగవదలుతూ) ఏయ్, ఆడకూలీలూ! పోతారేం? అరే రంగం! ఆ పళ్ళెంపట్టు; వాళ్ళదగ్గరున్న చనుబాలన్నీ ఏంచేసుకుంటాయి?

రంగం : (అతివినయం చూపుతూ) చిత్తం! వీళ్ళంతా పిల్లల కేగంజో త్రాగించి పనిలోకి వస్తారండి; వీళ్ళ చనుబా లేంచేసుకొంటారులెండి! (వెండిపళ్ళెం తెచ్చి కుర్చీకిదూరంగా కూలీలముందు పెడుతాడు.)

నందనం : అందుకనే సున్నగా ఉంటారు. ...... అలా తెల్లబోయి చూస్తారేం? మీరంతా ఆ పళ్ళెంలో పాలు పిండి పోండి. ఏం మునిగిపోయింది? ఇళ్ళదగ్గర కప్పుడే మీ మొగుళ్ళు వస్తారా?

రఘు : (రంగంవంక, నందనంవైపుచూచి పళ్ళు పటపట కొరుకుతాడు; కూలీల్లో గుసగుసలు)

మంగమ్మ : ఇంటికి వెళ్ళేసరికి పిల్లలు ఏడుస్తుంటారు స్వామీ! ఈ కుక్కలకు మనిషిపాలెందుకు? గేదెపాలు పోసి పెంచండి నాయనా!

నందనం : ఏడ్చావ్. ఆ సంగతి నీవు చెప్పేదాకా మాకు తెలియక కాదు. ... ... మీబుద్ధులన్నీ మారిపోతున్నాయిలే!

రఘు : (కోపం పట్టలేక) అయితే ఈ కూలీమనుష్యుల పాలుపోస్తే కుక్కల బుద్ధులు మారిపోవా దొరగారూ?

నందనం : తంతా వెధవా! ఎదురు మాట్లాడుతావా?

రంగ : ఏదో వాడెప్పుడూ అలాగే మాట్లాడుతాడులెండి!

నందనం : (శృతిమించుతున్న కోపంతో) ఏయ్, మంగళం! నీవు?... నిన్నే పలకవే? మిడిగ్రుడ్లేసుకు అలాచూస్తావేం?

శేషమ్మ : మంగళం ఏం మాట్లాడగలదయ్యా? పొట్టగడవక పనిలోకి రావడంగానీ, బిడ్డకు చాలా సుస్తీగా ఉంది; క్రిందిట్లో, మీదిట్లో - ?

నందనం : మీ కూలీలకున్న తెగులిదే! బాగా వంకలుచెప్పడం నేర్చుకొన్నారు ... ఏయ్, మంగళం! నీపిల్ల కేంపోయేకాలం?

మంగళం : (గుడ్లనీరుంచుకొని, దైన్యంగా) మీకేం తక్కువబాబూ! ఇతరుల బాధలు తెలియడానికి ?

నంద : ఏడ్చావుకానీ, ఆ పళ్ళెంలో కాసిని పాలుపిండి పో! చూడు. అయిదువేలు పెట్టి బెంగుళూరునుంచి తెచ్చిన ఈ జాకీలు ఎలా నకనకలాడుతున్నాయో!... ఏమే, మంగీ, రంగీ, మనిషి మనిషికీ చెప్పాలా? మీరుకూడా అలాచూస్తారేం? రోజూ మీరు చెప్పాలేం? పాలుపితికి పోలేరూ? కావాలంటే తలోకానీ ఇస్తాలే! నల్లమందు కొనుక్కుపోయి మీపిల్లలకు పడవేయండి, ఏడవకుండానిద్రపోతారు.

మంగమ్మ : మేం తిరిగి ఫ్యాక్టరీనుంచి వెళ్ళేదాకా నిద్రలేవరని పిల్లలకు నల్లమందు నేయడమేకాని, పిల్లలు చెడిపోతున్నారు తండ్రీ!

మంగళం : నా కొంపముంచింది ఆ నల్లమందే!

నందనం : మాటలతోటే సరిపుస్తారా? ఏమైనా ఈ విశ్వాసాల ఆకలితీర్చేదుందా?

ఆడకూలీలు : (ఒకరితర్వాత ఒకరుగా వెండిగిన్నెలో చనుబాలు పిండుతుంటారు.)

మంగళం : (వెండిగిన్నెలో తనపాలు పిండుతుండగా మంగళం కన్నీటిచుక్కలు వెండిగిన్నెలో పడుతాయి.)

నందనం : (మంగళం రొమ్ముమీద చేతికర్రతో పొడిచి) దరిద్రంముండా! ఏడుస్తా వెందుకు? నీ చళ్లేమైనా తీపిగా ఉన్నాయా?

రఘు : నందనంగారూ! కాస్త కోపం తగ్గించుకోండి నాయనా!

నందనం : మీరు కూలీలని నాకు బాగా తెలుసు. మీ తలబిరుసు తగ్గిస్తా. జాగ్రత్త! (కుక్కలను వెండిగిన్నె వద్దకు వదులుతాడు.)

కుక్కలు : (ఎగిరిపడుతూ) భౌ! భౌ!! భౌ!!!

—ఎర్రతెర నిప్పులుకక్కుతూ వ్రాలుతుంది.

## 2

## కూలీ పేటలో :

కొనఊపిరిఉన్న బిడ్డను చేతుల్లోపెట్టుకొని మంగళం గగ్గోలుగా ఏడుస్తూ ఉంది. కూలీలంతాచేరి విచారిస్తున్నారు. మేనేజరుగా రబ్బాయి మూడుకుక్కలనూ వెంటబెట్టుకొని రంగంవచ్చాడు.

కుక్కలు : (ఎగిరిపడుతూ) భౌ! భౌ!! భౌ!!!

రఘు : నీవు చవటవు. గులామువు. మన పొట్టలు కొట్టే యజమానుల తొత్తువు. ఛీ!

రంగం : (పరిసరబలాన్ని గ్రహిస్తూ) అయితే ఏమంటావు?

రఘు : కూలీల్లో పుట్టిన పరువుతీశావు. ఎందులోనైనా పడిచావరాదూ ?
రంగం : మాటలు కొంచెం ఆలోచించిరానీయి.
మంగళం : (కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తూ) బాబుల్లారా ! నా బిడ్డని బ్రతికించరా ? బిడ్డలనందరినీ నేనిలా పోగొట్టుకోవలసిందేనా ?
సుంగమ్మ : ఏడవకు. ఏంచేస్తావు ? డాక్టరుగారు చెప్పారుగా పాలుచాలక నల్లమందు వేయడంవల్లనే నీపిల్లలకు ప్రాణాంతకమైనదని !
రంగమ్మ : కుక్కలకు మనిషిపాలుపోసి పెంచడం ; కన్నబిడ్డలకు నల్లమందువేసి చంపుకోవడం ; రెక్కలమ్ముకున్న కూలీలస్థితి ! (నిట్టూరుస్తుంది)
శేషమ్మ : పొట్టతిప్పలు ! ఈ రంగంగాడు చూడరాదూ ? యజమానులు తినమన్న గడ్డిల్లాతిని జీర్ణంచేసుకొంటాడు. అందరూకలుసుంటే మనకీతిప్పలుఇరగడైపోను !
రావమ్మ : చాలీచాలని కూలితో ఫ్యాక్టరీలో రెక్కలు ముక్కలు చేసుకోవడం ; దానితోపాటు ఈ కూలీలరక్తంపిండి యజమాని కుక్కల్ని పెంచడం ! అబ్బా ! ఈ బాధలు భరించేబదులు ఈ బీదవాళ్ళంతా అంతమైపోతే బాగుండును !
చంద్రమ్మ: అదెలాజరుగుతుంది? చావుబ్రతుకులమధ్య ఊగులాడిస్తూ కులుకుతుంటారు.
రంగం : (అసహాయంగా చూస్తూ) ఇంతకీ మీరెవరూ ఇవాళ పనిలోకిరారన్నా మాట ! అయితే నే పోతున్నాను.
రఘు : ఓరి చవటా, చవటా ! ఇక్కడ క్రిందిట్లు మీదిట్లేమిటి? నీ వడిగేదేమిటి ? నీ కళ్ళేమైనాపోయాయా ? నీకూలీకళ్లుతీసేసి ఆయజమానులు తమకళ్లు పెట్టిపంపారా?
రంగం : ఏంచేస్తాం ? మంగళం పిల్లకు చానాళ్ళనుంచి సుస్తీగా వుందిగా, ఈ మాత్రానికి మీరంతా పనులుమానడం దేనికి ?
రఘు : కూలీపుటకఎత్తిన ఓరి రంగం ! నీవుచచ్చినా నందనంగాని,యజమానులుకానీ, ఒక్క కన్నీటిచుక్క రాల్చరు. నీ భార్యాబిడ్డల జీవనానికైనా దారిచూపరు. యజమానుల అండఉందికదా అని మురిసిపోతున్నావు. నీతిప్పలు ముందున్నాయిలే.
మంగళం : రంగంతండ్రీ ! నామీద దయచూడవా ? నాబిడ్డను బ్రతికించవా ?
రంగం : నేనేంచేయగలను ? నందనంగారినాన్నకి ఈసంగతి నిన్నే చెబితే హాస్పటలుకి తీసుకుపొమ్మన్నారు.
రఘు : ఆ మాటైనా ఇప్పుడు చెబుతున్నావన్నమాట !
మంగళం : (బిడ్డచనిపోయింది; గోడున ఏడుస్తూవుంది. కూలీలంతా కన్నీరుంచుకొని మంగళాన్ని ఓదార్చుతున్నారు.)
కుక్కలు · (ఎగిరిపడుతూ) భౌ ! భౌ !! భౌ !!!

— నల్లతెర రోదిస్తూ జారుతుంది.

# గుండం - రక్త సముద్రం!

---

పాఠకులకు —

గాంధీజీ - హిందూమతోన్మాదిచే - హత్య చేయబడ్డాక ఆ మహాత్ముడు ఎందెందు లీనమయ్యాడో అని శాంతిలేని గుండెలతో ఈ నాటికీ గాలిస్తున్నాను; అందుకు ప్రతిబింబమే యీ నాటిక! ప్రాచీన ధర్మ సమ్మతంగా వ్యక్తి చనిపోయినప్పుడు, ఖననం, దహనం అని కర్మ రెండు విధానాలుగా చెప్పబడింది. ఆ కర్మనే గాంధీజీ అస్థినిమజ్జనం పురస్కరించుకొని ఆధునిక విజ్ఞాన దృక్పథంతో పరిశీలించడానికి యీ నాటికలో ప్రయత్నించబడ్డది. 11, 12, 13, ఫిబ్రవరి 1948 తేదీల వాతావరణం యీ నాటికకు ఆధారం. అనగా గాంధీజీ అస్థినిమజ్జనంనాడు, అంతకుముందు, తర్వాత, రోజుల వాతావరణం దృష్టిలోపెట్టుకొని యీ నాటికను చదువ గోరుతున్నాను. ఇందులో ముఖ్యంగా 13-2-'48 నాటి సాయంత్రం ఆంధ్రప్రాంతాల్లో బ్రహ్మాండమైన వర్షం కురిసిందని గుర్తుంచుకోవాలి! ఇక చదవండి!

రచయిత:

డాక్టరు రాంబాబు

ఏలూరు, 19-2-'48.

పాత్రలు :

సముద్రుడు –
భూదేవి –
గాంధీజీ అస్థికలు –
అదృశ్యవాణి –

★

## 11-2-'48 నాటి సాయంత్రం :

సముద్రుడు షికారుగా వచ్చి సముద్రపుటొడ్డున కూర్చొని నాల్గువైపులా పరికిస్తూ తనలోతాను ఆనందిస్తున్నాడు. కెరటాలతో ఢీకొంటున్న గాలి తెరలు సముద్రుని కౌగిలించుకొంటున్నాయి. విషాదంతో క్రుంగిపోతూ ఆ దారినేపోతున్న భూదేవి సముద్రుని చూచి ఆగింది.

సముద్రుడు : (ఆహ్వానసూచకంగా చిరునవ్వుతో) భూదేవి దారితప్పి వస్తోంది.

భూదేవి : (లేని సంతోషం తెచ్చుకొంటూ) తొణకకుండా, బెణకకుండా సముద్రులు అబద్ధమాడుతున్నారు. ఈ గట్టుమీద నే నెప్పుడూ విహరిస్తుంటాను; కాని మీ రెప్పుడూ నాకు కనబడలేదు.

సము : హుఁ! ఏమీ తోచక ఇలావచ్చి కూర్చున్నాను భూదేవీ! ఇన్నేళ్ళుగా ఒకే మాదిరిగా గడపుకొనిపోతున్న నా దినచర్య ఇక చేయలేకపోతున్నాను. సముద్ర మట్టమంతా మకిలితో నిండిపోతోంది. సముద్రగర్భంలో ఎన్నివిధాల సౌందర్యమో నిండిఉందనీ, భూప్రపంచంకంటె అనేకవిధాల సౌందర్య భూయిష్ఠమనీ చాలామంది అభిప్రాయం. నిజంకూడాఅంతే! కాని ఈమధ్య అప్పుడప్పుడూ, భూమ్మీదకువచ్చి చూస్తునుకదా, ఈ భూలోకస్వర్గంముందు సముద్రం ఒక యమపురిగావుంది.

భూదే : సముద్రులు! ప్రశంసలు కురిపిస్తున్నారు. అయితే మిమ్ము, మమ్మల్ని పొగడమనేనా ?

సము : కాదు, కాదు; భూప్రపంచంముందు సముద్రప్రపంచమెంత ? ఇక్కడజీవుల్లో ఉన్న నాగరికత, జలచరాల్లో ఏమైనావుందా ? ఇక్కడ నానాటికి పెరిగి పోతున్న అభ్యుదయం అక్కడ ప్రారంభమైనా అయిందా ? మీరు మేము పరిశోధనకు కావలసివచ్చాంకాని; మీరు మా కెప్పుడైనా కావలసివచ్చారా ? నదీతీరాలుచూడు - ఎంత చక్కటిపట్నాలు, ఓడరేవులు, పరిశోధనశాలలు, సుందరభవనాలు, యంత్రాగారాలు ..... నేనెంత విశాలమైఎందుకు ? నీలో నున్న విశాలత నాలో లేనేలేదు.

భూదే : సముద్రులు ఇదంతా నిజంగానే అంటున్నారా ? కావచ్చు. అయినా మీ యంత ఆనందించేస్థితిలో మేములేము. ఈ ప్రకృతిసౌందర్యాన్నీ, అభ్యుదయాన్నీ ముంచివేసే అనేక-రెట్లు విషాదం పొంగి పొర్లుతోంది. నేనుగాని, నా సంతతిగాని, నిత్యం దుఃఖసముద్రంలో మునిగి ఆపద-కెరటాలతో కొట్టు బడుతున్నాం. ఈ గుండెలకు శాంతిలేదు. భయం- మృత్యుభయమే- దినదినమూ పెరిగిపోతోంది.

సము : అంత యిదేమివచ్చింది ?

భూదే : భూప్రపంచంలో మీరున్నదన్న నాగరికతకు చాలారకాల చీడపురుగులు పట్టాయి. వాటిని ఒకప్రక్కనుండి దులుపుకొని వస్తుంటే మరోప్రక్కనుండి పెరుగుతున్నాయి. అవి మానవులను తినేస్తున్నాయి; మహాత్ములను మ్రింగేస్తున్నాయి. సంస్కృతిని సాగనియ్యడంలేదు. అభ్యుదయాన్ని అరికట్టేస్తున్నాయి.

సము : (సానుతాపంగా) భూదేవి చాలా ఉద్రేకపడుతోంది. నాలోనున్న కల్లోలాని కంటె ఎన్నో రెట్లు భరిస్తున్నట్లున్నావు.

భూదే : గంభీరంగా ఉండడమేకాని, నాలోనున్నకల్లోలం పొంగిపొర్లిందా ? నీవు నన్ను మ్రింగేశావన్నమాటే ! సకల జీవకోటిశ్రేయస్సు నూతగా పెట్టుకొని నిల ద్రొక్కుకున్నాను. ఈమధ్య నా తనయులెందరో దుర్మరణాలకు పాల్పడ్డారు... వారి నందరినీ నాఒడిలోకి తీసుకొన్న పాపిష్టిదాన్ని.

సము : విచారాగ్నితో కుమిలిపోతున్నావు.

భూదే : నాసుపుత్రుడు గాంధీమహాత్ముని హిందూమతపిశాచి మ్రింగేసింది. నా తనయులంతా అతని భౌతికశరీరం భద్రపరుస్తారని ఎంతో ఆశించాను. వాళ్ళు ఎవరికివారు నాయకులమనే అహంభావంతో —పైకి గాంధీజీఅభీష్టానికి వ్యతిరేక మంటూ — ఆయన కాయాన్ని అగ్నిపాలు చేసేశారు. స్వాతంత్ర్యోద్యమంలో కాకలుదీరిన గాంధీజీఅస్థికలు రేపు పుణ్యనదుల్లో కలుపుతారు. (దుఃఖిస్తుంది.)

సము : దుఃఖించకు. చరిత్రనునడిపే సారథులెందరో అంతరిస్తున్నారు.

భూదే : సముద్రుడు ఈ విషయం తప్పక సహాయం చేయాలని కోరుతున్నాను. రేపు మీపాదపూజ చేయడానికి వచ్చే గాంధీజీఅస్థికలను కూర్చి ఆయనను పునర్భవుని చేయాలని వేడుతున్నాను.

సము : (అశక్తతతో కూడిన ఆశ్చర్యాన్ని వెల్లడిస్తూ) అది సాధ్యమా ? భస్మీభూత మైన అస్థికలను కూర్చడం, రూపొందించడం నాసాధ్యమా ? అశక్తుడను. భూమి ! నేను చేయలేనిపని నాకు చెబుతున్నావు.

భూదే : ప్రయత్నిస్తే సిద్ధించకపోదు.

సము : నేను నమ్మలేను. నాదరిజేరినవారి అస్థికలన్నిటినీ నా పరిశోధనాగారంలో పరీక్షించి సస్యబలంకోసం ద్రవీభూతంచేసి క్షేత్రాల్లో వర్షింపచేయడం నానిధి !

భూదే : నాకు తెలుసు ; ప్రయత్నించమనీ, ఫలితం సాధించమనీ ప్రార్థిస్తున్నాను. రేపీపాటికి గాంధీజీఅస్థికలు నీ పాదపూజ చేస్తుంటాయి. ఈ విషయంలో నీవు కృతార్థుడవైతే చరిత్రంతా తల్లక్రిందులై నాల్గు పాదాలతో అభ్యుదయం పురోగ మించడం తథ్యం !

సము : మహాత్ముడు ! భూప్రపంచంలో జీవులకు శాంతిసందేశమిచ్చి నా సముద్ర ప్రపంచంలో జీవులకు హింసనుండి విముక్తి నీయడానికి వస్తున్నాడు. స్వాగతం! నా జన్మ తరిస్తుంది. నేను పరిశుభ్రమౌతాను. గాంధీజీ! సుస్వాగతం! నాప్రయత్న బలం ఫలించునుగాక !

భూదే : తప్పక సిద్ధిస్తుంది. అహింసా సందేశమిచ్చిన బుద్ధమూర్తిని నేనే మ్రింగేశాను. అహింసామూర్తి గాంధీజీని నీవద్దకు పంపుతున్నాను. కాపాడేబాధ్యత నీది.

సము : దుఃఖించకు. అదిగో ! భూప్రపంచం విలపిస్తున్నధ్వని వినిపిస్తోంది. మానవ సమాజం విలపిస్తున్న విషాదగీతికలు నన్ను ద్రవించివేస్తున్నాయి. వినలేను ; ఇక వస్తాను, (నిష్క్రమిస్తుంటాడు.)

భూదే : (సముద్రునివంక ఆర్తురాలుగా చూస్తూ సజలనేత్రాలతో నిలబడుతుంది.)

అదృశ్యవాణి :

శోకాలకు తావులేదు
అన్యాయా లక్రమాలు
నిరసింపగ నశియింపగ
ప్రజాశక్తి కదలాలిక !

— నల్లతెర దుఃఖిస్తూ పడుతుంది.

# 2

## 12-2-'48 నాటి సాయంత్రం :

గాంధీజీ అస్థికలు సముద్రమునిచుట్టూ చేరిఉన్నాయి. సముద్ర గర్భమంతా ఒక్కసారిగా తేజోరాశితో నిండి వెలుగు తున్నట్లుగాఉంది. జలచరాలు నూతనయుగోదయ మైనట్లు పంకిలం విరిగిపోయి తాము పవిత్రమౌతున్నట్లు సంచరిస్తూ సమూహాలుగా చేరుతున్నాయి.

సము : స్వాగతం! మహాత్ములకు సుస్వాగతం!!

గాంధీజీ అస్థికలు : మహాత్ములకు మహాత్ములు సముద్రుల గౌరవానికి తగను.

సము : భూప్రపంచాన్ని పవిత్రమొనర్చి పంకిలమయమైన జలప్రపంచానికి ఏతెంచిన గాంధీమహాత్ములను గౌరవించలేని శక్తిహీనులమైన అనాగరీకులం!

గాం. అ : అగ్నితో పావనమైన నా దేహాన్ని మీ పావనోదకాలతో ద్రవీభూతం చేయ సముద్రులను వేడుకొంటున్నాను.

సము : మీ రాకతో జలప్రపంచమంతా పునీతమైపోయింది. హింసకు విశేషం గురి అయ్యే జలచరాలు. అహింసామూర్తికోసం తపస్సు చేస్తున్నాయి. బోధిసత్వునిచే విముక్తి చెందలేని అభాగ్యత మీ రాకతో తీరిపోతుందని ఆశిస్తున్నాము. నేటితో జలప్రపంచంకూడా నాగరికతోన్ముఖం అగుతుందని నమ్ముతున్నాను.

గాం. అ : అసమర్థుణ్ణి ; కాక, మానవుణ్ణి. సముద్రులుచేసే గౌరవానికి చిన్నబుచ్చు కొంటున్నాను. ఆలస్యంచేయక నన్ను కరుణించి నన్ను భూక్షేత్రాలపై వర్షించి నన్ను తరింపజేయ వేడుతున్నాను.

సము : గాంధీజీ! మిమ్ము చిరంజీవులుగా కూర్చడానికి, పునర్భవులను చేయడానికీ నిశ్చయించుకొన్నాను. ఒక్క మానవులోకానికే కాక, సమస్తచరాచరజగత్తుకూ ఏకైక జగన్నాయకులుగా మీరు అర్హులని మా నమ్మకం!

గాం. అ : అసంభవం! వృథాప్రయాస! మా మతవిధిప్రకారం నన్ను సస్యక్షేత్రాలపై వర్షింపజేయడం మీ తక్షణ కర్తవ్యం.

సము : ఒక మాట సాహసించి అంటున్నందుకు నన్ను క్షమించాలి. మత సమైక్యత అంటూనే తాము మతాభిమానం చూపుతున్నారు. ఒక ఒరలో రెండు కత్తు లిమడ్చబోయి తాము బలి అయ్యారు. తమలాంటి మహాత్ములుకూడా మతాని

కున్న విషస్వభావాన్ని చరిత్రనుండి గమనించకపోవడం మతం కల్గించిన వాతావరణ మెంత బలీయమైనదో అని ఆశ్చర్యమేస్తోంది. అధికారాభిలాషులు, నిరంకుశులు, ద్రోహులు, స్వార్థపరులు కల్పించిన మతాలకు మీ విశాలహృదయంలో సానుభూతికి తావిచ్చినందుకు విచారంగా ఉంది.

గాం. అ : అది నా వ్యక్తిగత విషయం. మతాన్ని వ్యక్తిగతాభిరుచిగా నాకుతోచిన సంస్కరణలతో అభిమానించాను. కనుక మీరంతా విమర్శించడానికి తావులేదు.

సము : అంటే వ్యక్తి కొక మతంకావడంలేదా మహాత్మా! విశాల ప్రపంచంలో విశాలహృదయాలు పెరగవలసినదిపోయి సంకుచిత హృదయాలు, శత్రువర్గం పెరగడంలేదా ?

గాం. అ : ఆ విషయంలో ఇక నన్ను మాట్లాడించకండి. నా కర్తవ్యం ముగిసింది. ఈ శుభసమయంలో నన్ను ద్రవింపజేసి, ఆవిరిగా చేసి, ఆకాశంలో మేఘాలుగా చేసి సస్యక్షేత్రాల్లో వర్షింపజేసి, నా చిట్టచివరికర్తవ్యమైన భూమికి బలమిచ్చే క్రియలో దోహదమిచ్చేటట్లు చేయ ప్రార్థిస్తున్నాను.

సము : మీ సందేశాలతోపాటు మీరు అమరులుగా ఉండడం జగచ్ఛ్రేయస్సని నమ్ముతున్నాను.

గాం. అ : భస్మాన్ని పట్టుకొని చిగిర్చింపబూనడం వృధా. నా కర్తవ్యం ముగిసింది. నాకు శాశ్వతశాంతి కూర్చండి.

సము : (దీర్ఘంగా ఆలోచించి ప్రయత్నం సాధ్యంకావడానికి ఒప్పుకోని గాంధీజీ అభిమతాన్ని శంకిస్తున్న వాడిలాగా ఇకనేమీచేయలేక) శాంతి! శాంతి!! శాంతి!!! (సముద్రునిచుట్టూఉన్న గాంధీజీఅస్థికలు ద్రవీభూతమై జలమయమైపోయాయి. సముద్రగర్భమంతా కుతకుత ఉడికిపోయింది. జలప్రపంచమంతా ఒక్కసారిగా అంధకారం వ్యాపించింది.)

అదృశ్యవాణి :

లోకంలో శాంతి, ప్రగతి
ఆనందం, అమరజీవనం
పూరితమై, పొంగిపొర్లే
భవిష్యత్తు, నిర్మించాలిక !

— నల్లతెర విలపిస్తూ జారుతుంది.

# 3

## 13-2-'48 నాటి సాయంత్రం:

ఆకాశమంతా మేఘావృతమై ఉంది. వాతావరణమంతా విషాదపూరితమైనట్లుండి శాంతిలేని గుండెలకు, ఉరుములు, మెరుపులు, భయకంపితులను జేస్తున్నాయి. సముద్రుడు మామూలుగా షికారుకువచ్చి; దుఃఖనిమగ్నయై, సముద్రుని రాకను ఎదురుచూస్తున్న భూదేవిని సమీపించాడు.

సము: అశక్తుణ్ణి. కార్యం ఫలింపజేయలేక పోయాను.

భూదే: (కంటికి మింటికి ఏకధారగా దుఃఖిస్తూ) అందరి ప్రయత్నాలూ గాంధీ వృధాచేసి పోయాడు. తన నిశ్చితం నిర్వర్తించుకొని పోయాడు. హృదయాలన్నీ సీల లూడదీసినట్లు శిథిలంచేసిపోయాడు. ఈ గుండెలకు శాంతిలేదు. ప్రపంచం-ముఖ్యంగా భారతజాతికి నేను అని నిలబడేవాడు ఇకలేడు. నాయకులంతా ఇలా హతింపబడుతున్నారు. జీవితాలు తృణప్రాయాలైపోతున్నాయి. శాంతిలేని నాగరికత పెరిగిపోతోంది. ఈ భూప్రపంచమంతా అంతర్విరోధాలతో అగ్నిగుండం అయిపోతుందని భయపడుతున్నాను. భవిష్యత్తంతా అగ్నిమయమగునని కుమిలిపోతున్నాను. తథ్యం!

సము: ఈ సముద్రుని విశాలహృదయానికి శాంతిలేదు భూదేవీ! అంతర్విప్లవాలతో సముద్రమంతా రక్తసముద్రమయిపోతుందని భయపడుతున్నాను. భవిష్యత్తంతా రక్తమయమగునని క్రుంగిపోతున్నాను. (దట్టంగాక్రమ్ముకొన్న మేఘాల నుండి ఉరుములు, మెరుపులతో, భోరున వర్షం కురవనారంభించింది.)

భూదే: (వర్షంచేత తడుస్తున్న విశాల భూప్రపంచాన్ని అశ్రుపూరితనయనాలతో తిలకిస్తూ) లోకాస్సమస్తాస్సుఖినోభవంతు!

అదృశ్యవాణి:

పరిత్రాణాయ సాధూనాం। వినాశాయచ దుష్కృతాం।
ధర్మ సంస్థాపనార్థాయ। సంభవామి యుగేయుగే॥

—నల్లతెర నిశ్శబ్దంగా వ్రాలుతుంది.

శాంతి!!!

పాత్రలు :

మంగమ్మ : గ్రుడ్డిముసలిది
రంగమ్మ : కోడలు
పసిపాప : రంగమ్మ బిడ్డ
పోలీసు రామస్వామి –
కొందరు దారిపోయేవాళ్లు –
ఒక కుర్రాడు –
ఒక వర్తకుడు –
అదృశ్యవాణి –

# విద్యుద్దీప స్తంభం క్రింద :

కళ్లు లేని ముసలిఅత్త మంగమ్మను, ముందుంచుకొని, పసి పాపను ఒడిలో పెట్టుకొని, రంగమ్మ అడుక్కొంటూ ఉంది; దారిపోయేవాళ్లు వినపడనట్లే పోతున్నారు.

రంగమ్మ : (అతిదీనంగా) బాబుల్లారా ! ...

మంగమ్మ : (చేతులెత్తి దండాలు పెడుతూ) కళ్ళులేవు; దయతలవండి నాయనల్లారా!

రంగ : అయ్యల్లారా ! ...

మంగ : పసిగ్రుడ్డును కరుణించండి తండ్రుల్లారా !

రంగ : కరుణాత్ముల్లారా ! ...

మంగ : బీదల రక్షించండి ! పుణ్యాత్ములారా ! (కొన్ని క్షణాలు ఆగి) అ-బ్బా ! ఎండ చుర్రుమంటోంది ; ఇంతవరకూ దమ్మిడీఅయినా దొరకలేదు.

రంగ : అత్తమ్మా !

మంగ : ఏమమ్మా ! ఎన్నాళ్ళీ బ్రతుకనుకొంటున్నావా ? ఈ బీదతనం మనతోటే తీరిపోయేదికాదుతల్లీ !

రంగ : (హఠాత్తుగా) పోలీసు రామస్వామి వస్తున్నాడత్తమ్మా ! ఈ పీడ వదలించుకోలేకపోతున్నాం.

మంగ : ఏంచేస్తాంతల్లీ ? ముష్టిలోవీరముష్టి ! పోలీసువాళ్ళు యినపగుండెల మనుష్యులయ్యారని నీవెప్పుడూఅంటుంటావు; కానీ వాళ్ళు పాలుపోసి పెంచుతున్న విషకీటకాలుగాకూడా అయిపోయారు.

రంగ : ఊరుకో, వస్తున్నాడు... బాబుల్లారా !

మంగ : ఒక్కదమ్మిడీ దయచేయండి ధర్మాత్ములారా !

=ప్రవేశం : పోలీసు రామస్వామి=

పోలీసు : (కపటంగానవ్వుతూ) రోజుకంటే ఇవాళ పెందరాడే వచ్చినట్టున్నారే? పండగరోజులు ! ఇవ్వాళ బాగా సంపాదించిఉంటారు; ఏం రంగీ ?

రంగ : (మాట్లాడకుండా ఊరుకొని అత్తముఖంవంక ప్రశ్నార్థకంగా చూస్తుంది)

మంగ : ఏం పండగ రామస్వామితండ్రీ ? ఒక్కదమ్మిడీ చిటుక్కున వేసినవాళ్లులేరు.

పోలీ : ఏడ్చావ్. ఎప్పుడుచూచినా అదేఏడుపు ! ఏం దొరక్కపోతే మీరలా ఊరుకొనేవాళ్ళేనా ? వూరూ వాడా ఏకమయ్యేటట్లు—

“కళ్ళు లేవ్వూమాకు నారాయణా ! కరుణించి ధర్మంబు నారాయణా !
చేయండి మీా చలవ నారాయణా !”

అని అరవకపోయారూ ? దొంగవేషాలు వేయకండి ; ముండల్లారా

రంగ : లేదయ్యా! ఎవరినడిగినా రోజూ మీకిదే పాటైపోయిందంటున్నారు. ఈ గిన్ని చూడరాదూ? (వట్టిగిన్ని చూపుతూ) దమ్మిడీ దొరకలేదు.

పోలీ : నీవు మరీను. పోతుల్లాగా ఉండి బీదఅరుపులు అరుస్తారు.

రంగ : మీ కళ్ళకు అలా అగుపడుతున్నాం.

మంగ : మీకేంబాబూ, మహారాజులు! ఎలాగైనా సంపాదించుకొంటారు; పెళ్లాం బిడ్డల్ని పోషించుకొంటారు. ... ఈ పసిదాన్ని చూడు! తల్లికి తిండిలేదు; పిల్లకు పాలుచాలక గిజగిజ కొట్టుకొని ఏడుస్తోంది; ఈ ఎండల్లో, దుమ్ములో పడి ఉంటోంది.

పోలీ : (ఎర్రటోపీ తీసి నెత్తిమీది చెమట తుడుచుకొంటూ) మీ రెప్పుడూ యిదే సోది చెబుతారని నాకు బాగా తెలుసు. సరేకాని, ఒక బేడఉంటే ఇలా పారేయండి!

రంగ : ఏ ఒట్టుపెడితే ఆ ఒట్టు అన్నయ్యా! ప్రొద్దుటినుంచి చిల్లిగవ్వ వేసినవాళ్ళు లేరు. దొరికినరోజున నీ కివ్వకుండా మానేశామా?

పోలీ : మీరీమధ్య మరీ క్రొవ్వెక్కి కొట్టుకొంటున్నారులే! నా కివ్వబడుతోందని దొరికిన డబ్బులన్నీ ఎప్పటి కప్పుడు దాచేస్తున్నారు. నేనూరుకోకపోతే మీ అమ్మ మొగుళ్ళెవ్వరన్నా ఇక్కడ కూర్చొని అడుక్కోనిస్తారా? పోండి! (గిన్ని మీద ఒక్క తన్ను తన్ని) రేపుకాన ఈ సమీపంలో కనబడితే తన్ని జైల్లో పడేస్తాను. వెధవముండల్లారా! ఇద్దరూ ఒకవోళే తగలడి ఏడవకపోతే తలో చోటా అడుక్కోరాదూ?

రంగ : అలాగే బాబూ! ఇకనుంచి నే నా వీధికిపోయి అడుక్కొంటాను. (పసిపాప ఏడుస్తుంటుంది.)

పోలీ : మళ్ళా ఇలావస్తాను; జాగ్రత్త పెట్టి ఉంచండి. లేకపోతే ఇవాళ మీ మూట ఎక్కడ దాచిందీ కనుక్కోవడమో, మీ ఎముకల్లో సున్నం దులపడమో, జరపాలసిందే! (ఎర్రటోపీ నెత్తిన పెట్టుకొని విసురుగా వెళ్లిపోతాడు)

రంగ : బాబుల్లారా!...

ఒక కుర్రాడు : (గిన్నిలో కానీవేసి పసిపాప వంక కూలిగా చూచి వెళ్ళిపోతాడు.)

మంగ : పోలీసు తండ్రుల్లారా! అందరితోపాటే పుట్టి మీ రింత నిర్దాక్షిణ్యు లెలా అయ్యారు? మూలనున్న ముసలమ్మలమీదా, ఆకలికడుపుల ఎముకల ప్రోగుల మీదానా, మీ పవరు చెల్లించుకోనడం? డబ్బుగలవారి దగ్గర మీ ఎర్రటోపీలు దించి వంగి నమస్కరిస్తారు.

రంగ : నాయనల్లారా!...

మంగ : ఆకలితీర్చండి అన్నదాతలారా!

# 2

# కొన్ని రోజుల పిమ్మట :

ఆ విద్యుద్దీపస్తంభం క్రిందనే గ్రుడ్డిమంగమ్మ మాత్రమే యథాప్రకారంగా అడుక్కుంటూ ఉంది.

మంగ : అయ్యల్లారా ! ఈ గ్రుడ్డిదాన్ని కాపాడండి.

దారిపోయే ఒక వ్యక్తి : (ఒక కానీ వేసి వెళ్ళిపోతాడు.)

ఇంకో వ్యక్తి : (వెళ్ళిపోతూ) ఈ దరిద్రులు ఇలా ఏడుస్తుంటారు కనుకనే; సస్యశ్యామలమైన ఈ దేశం అన్ని విధాలా అడుగంటుకుపోయి అనేక ఇబ్బందులు పడుతోంది.

మంగ : నాయనల్లారా ! బీదల్ని కాపాడలేని మీరు మమ్మల్ని నాశనమైనా చేసేయండి ; మేముండడం నిజంగా మీకు శ్రేయస్కరం కాదు.

— మరో వ్యక్తి : అబ్బో ! వీళ్ళకేక నుక పూర్తిగా తిండుంటేనా ఈ గవర్నమెంటు అంతు తెలుసుకోరూ ? (వెళ్ళిపోతాడు.)

మంగ : ఈ బీదదాన్ని దయతలవండి; అయ్యల్లారా !

— ఒకమ్మ : శనిముండా ! ఎప్పుడు చూచినా ఇక్కడే చచ్చిపోతావేఁ ? అలా అరిచేబదులు ఎందులోనన్నా పడి చావరాదూ ! (మెటికలు విరుస్తూ పైటచెంగు నేలరాపాడిస్తూ జాడించుకొంటూ గిరుక్కున పోతుంది.)

మంగ : అ-బ్బా ! ప్రొద్దుటినుంచి గొంతు చించుకొని అడుక్కొంగా బేడడబ్బులు దొరికాయేమో ! ఇందులో పోలీసాయన ఎంతకావాలంటాడో ! . . . కరుణించండి !

— ఒకడు : (నిదానించి మంగమ్మను చూచి) ముసలిదైనా గునపంలా ఉంది ; కళ్ళు లేవని బుడిబుడిరాగాలు తీస్తుంది. వేషం ! దున్నపోతులా కష్టపడలేక అడుక్కు తినడం !

మంగ : ఈ కళ్ళులేనిదాన్ని కాపాడండి ; నాయనల్లారా !

— ఒక కుర్రాడు : (ఒక కానీ గిన్నెలో వేసి) ఏం మామ్మా ! మీ పాపాయి కనపడ్డంలేదేఁ ?

మంగ : (వాత్సల్యంతో) నాయనా, బుల్లోడా ! ఎవరబ్బాయివి బాబూ ? మా పాపాయంటే నీ కంత ముద్దా ?

— కుర్రాడు : ముద్దుకాదు : రోజూ ఈ దారిన బడిలోకి పోతుంటాను. పాపాయి ఏడుపు చూడలేక మా అమ్మ రోజూ నాకు కొనుక్కోడానికి ఇచ్చే కానీ పాపాయి కని గిన్నెలో వేసి పోతుంటాను ; పాపాయి ఏది మామ్మా ?

మంగ : నిన్ను కన్న తల్లి పుణ్యాత్మురాలు బుల్లోడా! నీలాంటి పిల్లలంతా ఈ బీద తనాన్నే లేకుండా చేయడానికి పూనుకోవాలినాయనా! పాపాయిని వాళ్ళమ్మ అడుక్కోవడానికి తీసుకెళ్ళింది.

— కుర్రాడు : నే పోతున్నాను. (వెళ్ళిపోతాడు)

మంగ : అయ్యలారా! ఈ దీనురాలి ఆకలి తీర్చండి నాయనల్లారా! అ – బ్బా! మరణం ఈ అడుక్కు తినడానికంటే బాధాకరమైనదా? చావంటే ఎందుకు వెరవడం? ఈ బాధలన్నీ మరచే ఒక్క క్షణం నా జీవితంలో వస్తుందా? ఏ- మో! ఏమో!! ఏమో!!!... బాబుల్లారా! ఈ ముసలిదాన్ని కరుణించండి తండ్రుల్లారా!

— ఒక వర్తకుడు : (జేబులో చేయుంచుకొని) ఏయ్, ముసలీ! ఇదిగో అణా; కానీతీసుకొని మూడుకానులీయి.

మంగ : దయగలబాబులు! కళ్లులేనిదాన్ని. (గిన్ని నెట్టుతూ) ఈ గిన్నిలోఉన్నాయి; తీసుకోండిబాబూ!

— వర్తకుడు : (గిన్నిలో డబ్బులన్నీ తీసుకొని జేబులోవేసుకొని ఒక మట్టిపెల్ల ఆ గిన్నిలోవేసి మాట్లాడకుండా వెళ్ళిపోతాడు.)

మంగ : దీనరక్షకులు! మీ లాంటి ధర్మదాతలుండబట్టే ఈ లోకం ఇంకా నిలుచుంది. దయతలచి మా కడుపుమంటలు చల్లార్చండి రక్షకులారా!

=ప్రవేశం : పసిపాపనెత్తుకొని రంగమ్మ=

రంగ : (ఏడుస్తున్న పసిపాపను మంగమ్మకిస్తూ) అత్తమ్మా! ఊరంతా తిరిగాను, మరీగడ్డురోజులైపోయాయి; ఈ పావుసేరు గింజలు దొరకడం గగనమైపోయింది. (పసిపాప ఏడుపుమాని మంగమ్మ ముఖాన్ని పునుకుతుంటుంది.)

మంగ : ఇవ్వాళ నీ పుణ్యమా అని నా కో బేడడబ్బులు దొరికినట్లున్నాయి.

రంగ : (గిన్నిలో మట్టిపెల్లను చూచి ఆశ్చర్యంగా) ఇదేమిటి అత్తమ్మా! డబ్బులేవీ? మట్టిపెల్లలున్నాయి!

మంగ : (కంగారుగా గిన్నిని కదుపుతూ) అయ్యో! నోటికందిన ముద్దనుకూడా గద్దలు తన్నుకుపోతున్నాయమ్మా! (కన్నీటి చుక్కలు గిన్నిలో రాలుతాయి.)

రంగ : గిన్ని ఎవరన్నా ముట్టుకొన్నజాడ నీకు తెలియలేదా అత్తమ్మా?

మంగ : ఏమో తల్లీ! ఇంతకుముందే ఆయ నెవరో అణా తీసుకొని తక్కిన మూడు కానులీయమంటే 'కళ్ళులేవు బాబూ, గిన్నిలో ఉన్నాయి, తీసుకో' మన్నాను.

రంగ : అయితే ఇంకేం; తినమని మట్టిపెట్టి డబ్బులన్నీ తస్కరించుకుపోయాడు. అయ్యో! మన వస్తువులు ఇలా సాగవలసిందేనా ? ఆకలికడుపులు కొట్టడం పరిపాటైపోయింది. సమయానికి పోలీసాయనకూడా వస్తున్నాడు.

మంగ : గోరుమట్టుమీదే రోకలి పోటు !

=ప్రవేశం : పోలీసు రామస్వామి=

పోలీసు : ముండల్లారా ! బాగా సంపాదనమరిగి ప్రొద్దస్తమానమూ ఇక్కడే పడిచస్తున్నారు. ఏం! ఏమైనాఉందా ? ఏమాత్రం సంపాదన ?

రంగ : (కంట నీరుపెట్టుకుంటుంది.)

మంగ : ఏం చెప్పనుబాబూ! గిన్నెలో డబ్బు లేమహాత్ములో గ్రుడ్డిదాన్ని చూచి ఎత్తుకపోయారు; కోడలిది పొట్టతిప్పలికిపోయి ఇప్పుడొచ్చింది.

పోలీసు : (రౌద్రంతో) దరిద్రంముండల్లారా ! (మంగమ్మను తనశక్తికొలదీ ఒకతన్ను తంతాడు) చావుముండ ! (రంగమ్మమీదికి కాలుఎత్తి) ఇది మరీ పిసినిగొట్టు. రోజూ నన్ను యిలాగే తలాయిస్తున్నారు.

మంగ : (పసిపాపతోపాటు క్రిందికి దొర్లిపోయి కళ్ళు తేలవేస్తుంది.)

పసిపాప : (హృదయ విదారకంగా గ్రుక్కపెట్టి ఏడుస్తుంటుంది.)

రంగ : (పసిపాపను కౌగలించుకొని మంగమ్మమీదపడి దుఃఖిస్తూ) అత్తమ్మా ! ఇవ్వాళితోసరా ? (శోషవచ్చి పడిపోతుంది.)

అదృశ్యవాణి :

ప్రపంచమంతట ఆకలిమంటలు
ప్రసరించిన దీ దీపం !
అన్యాయాల ఇనుపగుండెలకు
ఆలవాల మీ దీపం !
ఈ వెలుగుబాసిన దీప స్తంభం
ఊగులాడుతోంది ;
శక్తులనన్నీ ఏకముజేసీ
గుంజిగుంజి పెరికేయాలీ ;
పెరికేయాలీ, పెరికేయాలీ ఇక

క్రుళ్లువ్యవస్థను పెరకాలీ!
శుభోదయంబున నవకాంతులు వెలసే
దీప స్తంభం పాతాలీ;
పాతాలీ, పాతాలీ ఇక
సామ్యవ్యవస్థను స్థాపించాలీ!
దురాశ, మోసము, హింసలనన్నిటి
జగంబునుండే తరుమాలీ;
తరుమాలీ, తరుమాలీ ఇక
సమాజ ద్రోహుల చండాడాలీ!
చీకటులన్నీ బ్రద్దలుచేసే
చైతన్యాన్నే కలిగించాలీ;
కలిగించాలీ, కలిగించాలీ ఇక
విశ్వప్రేమను ప్రసరించాలీ!
ఆనందాబ్ధిని అమృత వాహినులు
ప్రభవింపగనే చేయాలీ;
చేయాలీ, చేయాలీ ఇక
వర్గరహితమే చేయాలీ!
గతంబునుండీ ముందుకుపోయే
కాంతిపథమునే చూపాలీ;
చూపాలీ, చూపాలీ ఇక
సృష్టిమర్మ మెరిగించాలీ!
దుఃఖదగ్ధ పరిపీడితులపై
సుధాశీకరాల్ చిలకాలీ;
చిలకాలీ, చిలకాలీ ఇక
జీవితాలనే నిలుపాలీ!!!

△

పాత్రలు :

అన్నపూర్ణ –
కాంతారావు : భర్త
రామారావు : బంధువు, ప్రేమికుడు, వరసకు మరది
చంటిపిల్ల : ఏడుగోజుల గ్రుడ్డిపిల్ల, నాల్గోసంతానం

## నాటి పగలు:

వాతావరణమంతా ఉబుసుపోనట్లుగా ఉంది. చావిట్లో రామారావు కూర్చున్నాడు. అన్నపూర్ణ తలుపు దరిగా నిలబడిఉంది.

అన్నపూర్ణ : ఈ సంవత్సరమయినా ఇంటికివచ్చేస్తావా రామారావూ ? అయిందేదో అయింది; వచ్చి ఆ పెద్దవాళ్ళను కనిపెట్టుకొని ఉండు.

రామారావు : (చిరునవ్వుతో మౌనం)

అన్న : అక్కడైనా నీవు సుఖపడుతున్నావనుకోను; నీ పిచ్చేగాని.

రామా : అమ్మా, నాన్నా, మీరంతా పసిపిల్లను నాకు చేస్తానంటే, ఎదరపడి, ఎదిరించలేక తప్పించుకొని దూరంగా ఉండడమేనా నా పిచ్చి ?

అన్న : (ఏదో ఆలోచనలో దిగినట్లు) అవుననుకో......

రామా : పిచ్చను, మరేమైనా అనుకో ; నాకు సుఖంగానే ఉంది.

అన్న : (ఆనందంతో తటపటాయిస్తూ) రామారావూ ! .....

రామా : పిల్లలేరీ – రత్నం, మాణిక్యం, కనకం ? ఆడుకోడానికి వెళ్ళారా ? బళ్ళోకి పంపుతున్నారా ?

అన్న : (అప్పుడే ఆలోచననుండి తేరుకొన్నట్లు) పెద్దవాడొకడే బడికి వెడుతున్నాడు. ఏం చదువులో ఏమో ; సంవత్సరానికొక తరగతి ! ఇంటివద్దే రెండేళ్లు శ్రద్ధగా ప్రయివేటు చదివించి హైస్కూల్లోనే వేయాలనుకొంటున్నారు ; మీ అన్నాయి.

రామా : సాగితే అదే మంచిపని. (లేచి) వెళ్ళొస్తా ; అన్నాయితో నే వచ్చి వెళ్లానని చెప్పు.

అన్న : కూర్చో రామారావు. నీతో మాట్లాడుతుంటే ఎంతో ఇదిగా ఉంది. పెద్దవాళ్లంతా పోతున్నారు, రామారావు. ఒకోసారి ఏమేమో జ్ఞప్తికి వస్తూ గుండెలు కలేస్తుంటాయి. మీ అన్నాయి ధర్మమా అంటూ మా సంసారవిషయంలో ఏ చీకూచింతా లేదుకాని ; ప్రపంచవిషయాలే ఒకోకప్పుడు నిరాశ, నిస్పృహా, నిర్లిప్తతా, కల్గిస్తుంటాయి.

రామా : (కూర్చుని పరధ్యానంగా) మీ అందరినీ చానాళ్ళకు చూచాను.

అన్న : (రామారావును తదేక దీక్షతో చూస్తూ) ఇప్పటికైనా పెళ్లి ... ?

రామా : ఆ మాట ఎత్తకు. నా కొక గుదిబండ ఎందుకులే ! (నవ్వుతాడు.)

అన్న : (నవ్వి) ఏదో అన్నట్లుంది. ఎన్నాళ్ళు సాగుతుంది. ఎన్నాళ్ళు ఈ దేశ

సంచారం ? వయసొచ్చిన తర్వాత పెళ్ళిచేసుకోనక పోవడం సమాజానికి అపకారంకూడాను రామారావు !

రామా : ఇంతవరకూ సూత్రాలుకట్టినవాళ్లవల్ల ఉపకారమే కల్గింటే ఇంతికుళ్ళుతో సమాజం ఉండనేఉండదు.

అన్న : వివాహం-వేడిరక్తాన్ని చల్లార్చేసి అన్నివిధాలా పురోగమనాన్ని అరికట్టేస్తుంది. "వివాహంవల్ల సంసారభారం ఏర్పడడమే సమాజంలోని దురాచారాలను ఎదుర్కోలేని దౌర్బల్యాన్ని కొనితెచ్చుకొనడం" అని నీ వెప్పుడో నాన్నతో అన్నావటగా ? అందు కాయనకు చాలా కోపంవచ్చింది.

రామా : కాదంటాడా ? ఉహుఁ.

అన్న : నువ్వెన్నయినా చెప్పు ; వివాహంలేనిజీవితం అసంపూర్ణం.

రామా : ఆ గొడవల్లో దిగితే చాలా ఉంది. మీ అందరికీ నేనొక సమస్యనైపోయానన్నమాట !

అన్న : నిజంగా గట్టి చిక్కు సమస్యవే అయ్యావు.

రామా : అదే విడిపోతుంది. (ఇద్దరూ నవ్వుతారు.)

అన్న : విడగొట్టించుకోడానికి నీ విష్టపడితేగా ?

రామా : ఇష్టపడితే మీరే కావాలా ? మీరంతా పాతవాసనలు వెదజల్లే వాడిపోయిన పూలు !

అన్న : నీతో మాట్లాడగలమా బాబూ ; మాటలు నేర్చావు.

రామా : (లేచి) పోనీలే, వెళ్ళొస్తా.

అన్న : (అతనివంక ఆశగా చూస్తూ) రేపుంటావుగా ? ఉంటే, రాత్రి కొకసారి తప్పక రా ; వస్తావుకదూ ?

రామా : ఆఁ. సరేలే !

అన్న ! సరేలే అంటే కాదు ; తప్పక రావాలి !

రామా : (వెళ్లిపోతాడు.)

అన్న : (పొంగుకువస్తున్న ఆనందంతో) మాటతప్పడు. తప్పక వస్తాడు. ఎంతరూపుదేలాడు ! చూచి అయిదేళ్ళయింది. ఎన్ని మాటలు నేర్చాడు ! ! ! (గుండెలొత్తుకొంటూ దీర్ఘాలోచనతో అలాగే నిలబడి ఉంది.)

—తెల్లతెర ఆనందంగా జారుతుంది.

# 2

## నాటి రాత్రి :

వాతావరణమంతా, మధురక్షణాలు గుర్తుకుతెచ్చి ఆనందంలో ముంచేదిగా ఉంది. సాధారణాలంకారాలతో నున్న గదిలో పడకకుర్చీలో రామారావు కూర్చున్నాడు. అన్నపూర్ణ అతని పాదాలవద్ద కూర్చుని, చేయిపట్టుకొని బ్రతిమాలుతోంది. కిటికీలోనుంచి వస్తున్న వెన్నెల వెలుగు, గదిలోని దీపపు వెలుగూ, కాంతిలో అన్నపూర్ణ చాలా చిన్నదిగానూ, సౌందర్యరాశిగా అగుపడుతూ ఉంది.

రామా : (నిగ్రహంతో) చాలా తొందరపడుతున్నావు వదినా ! ...

అన్న : (ఉద్రేకంతో) కావచ్చు. భరించలేను. నిన్ను చూచిన ఉద్రేకం ఎప్పుడు తగ్గుతుందో !

రామా : నిండు నెలలతో ఉండి- రేపోమాపో ప్రసవించబోతూ నీ వీ పనికి పూనుకోవడం బాగుందా ? ఆ పుట్టబోయే పసిబిడ్డకు ఎంతహాని ! అన్నాయికి అన్యాయంచేసి నీవు అధోగతికి పోవడంగాదా ?

అన్న : కోరి పిలచినదాన్ని తిరస్కరించి మధురక్షణాలు పోగొట్టకు. నీలో ఏదో నన్నాకర్షించింది. నాలో కల్గిన ఈ మార్పుకు - భ్రమకు - నాకే నిలువెల్లా సిగ్గేస్తోంది.

రామా : ముగ్గురుబిడ్డల తల్లివి. నా కంటే పెద్దదానివి. నా మీద నీ కోర్కె పారడం చాలా విచారంగా, చిత్రంగాఉంది. ఇది నన్నవమానం చేయడమే !

అన్న : (రామారావును కౌగిలించుకోబోతూ గోడనున్న భర్తఫొటోవంక అదేవిధిగా చూస్తుంటుంది.)

రామా : ఈ పని ప్రస్తుతం నీకు సుఖమనికూడా అనుకోలేను. మా అన్నవల్ల నీకే విషయంలో ఏమీ అన్యాయం లేనప్పుడు నీ ఈ ప్రయత్నమేమిటి ?

అన్న : ఆ మాట అనకు. ఆయన పూజ్యుడు. కడుసమర్థుడు. ఏదో నీకు లొంగిపోయాను. నా జీవితంలో చిత్రాతిచిత్రరంగంలో ప్రవేశించాను. స్వప్నమను, మతిభ్రమను, ఈ జీవిత నాటకంలో ఇదో రంగమను, స్వర్గద్వారానికి తలుపులు తట్టడమను- ఏమైనా అనుకో ! నన్ను బాధపెట్టకు.

రామా : నన్నే చాలా బాధపెడుతున్నావు. నాకు వివాహం కాలేదన్న మాటే గాని నీలాంటివారి నెందరినో ఎరుగుదును; పాడుచేశాను. కాని నీ విషయంలో మహాపాపం చేసినవాడనౌతాను.

అన్న : నాదే పొరబాటు రామారావు! నీకు వివాహం కానక్కరలేదు. అంతా నిన్ను ప్రేమించగలరు. ఆ ప్రత్యేకత నీలో ప్రతిబింబిస్తుండబట్టే నీవు వివాహాన్ని ఇన్నాళ్ళుగా తిరస్కరిస్తున్నావు.

రామా : అది వట్టిమాట. నన్ను కోరివచ్చినవారు ఎవ్వరూలేరు. కాని; నేనే చాలా మందిని పాడుచేశాను. చేస్తున్నాను.

అన్న : ఇంతవరకు పుస్తెగట్టిన భర్త తప్ప పరపురుషుని ముఖమెరుగని నేను వలచితే కాదనకు..... ఏమైనా నా కోరిక తీర్చక తప్పదు.

రామా : ఈ మాత్రానికి వివాహబంధా లెందుకు వదినా!

అన్న : మాటలేగా! ఉత్సాహంలోని పటుత్వం తగ్గకముందే నా సాహసానికి చేయూత నీయవా? ఈ రాత్రి నన్ను హాయిందేల్చవా?

రామా : ఈ రాత్రి నాకు అయోమయంగా ఉంది.

అన్న : (రామారావును కౌగిలించుకొని) రామారావు!....(ముఖంలోనికి చూస్తుంది.)

— పసుపుతెర సంతోషంగా కలుస్తుంది.

# 3

## ఏడో నాడు :

వాతావరణమంతా హృదయాలను కలికేస్తూ అంతశ్శుద్ధి చేసేదిగా ఉంది. ఏడురోజుల చంటిపిల్ల చిన్న మంచంమీద పరుంది; కళ్ళు లోతుగా ఉండి నీళ్ళు కారుతున్నాయి. ఎదురుగా కుర్చీలో కూర్చుని కాంతారావు విచారిస్తున్నాడు; గుండెలు బద్దలై కన్నీరుగా వెడలుతున్న దుఃఖాన్ని మ్రింగలేక పోతున్నాడు. బాలింత అన్నపూర్ణ ప్రవేశించి భర్త స్థితిని గ్రహించి అతని ప్రక్కనే కూలబడింది.

కాంతారావు : (భార్యవంక దీర్ఘంగా చూస్తూ) కళ్ళులేనిది బిడ్డకేగాదు; మనకు కూడాను! మన జీవితాంతంవరకు కళ్ళులేని ఈ బిడ్డనుచూస్తూ దుఃఖాగ్నితో

భరించి పోవలసిందే! అమృతం సేవించినా హాలాహలం అయిపోతుంది. ఏ పాపం ఎరగని ఈ పాపకు నేత్రాలు పోవడమేమిటి? ఇది ఎవరి పొరపాటు? అన్నపూర్ణా!.. .. (దుఃఖం భరించలేక భోరున ఏడుస్తాడు)

అన్న : (దుఃఖిస్తూ, భర్తపాదాలమీదపడి)ఇదంతా నా పాపం! నన్ను క్షమించకండి.

కాంతా : కాదు; కాదు కూడాను.

అన్న : పుట్టగానే పాపకళ్ళు సొనలాగా కారిపోయాయని మంత్రసాని చెప్పింది.

కాంతా : అ-బ్బా! ఈ కళ్ళోల ప్రపంచం చూడవని పాప తలంచుకొందా?

అన్న : నన్ను చంపుడి. పాపకళ్ళు వస్తాయి. ప్రసవించిననాటినుండీ నే నెన్నడూ ఎరుగని బాధలు కనబడుతున్నాయి; మంత్రసాని వచ్చి చికిత్స చేస్తోంది.

కాంతా : మధ్యస్థంగా మనకూ, పుట్టగానే పాపకూ, దాపురించిన ఈ బాధను భరించేదెవరు? నాకు అయోమయంగా ఉంది; అంధకారం నన్ను క్రమ్మేస్తోంది. నేనుబ్రతికి ఈ కళ్ళతో ఈ కళ్ళులేని నా కన్నబిడ్డను చూడలేను. (తన నేత్రాలు గుప్పిటతో పిసుక్కుంటాడు.)

అన్న : (భర్తచేతులను పట్టుకొని) నేనీబాధ భరించలేను; చూడలేను. నేచేసినతప్పుకు చంపినా, మరేమిచేసినా నాకిష్టమే! ఇన్నేళ్లువచ్చి ఆ రోజున గ్రుడ్డిదాని నైపోయాను. అందుకే యీపాప గ్రుడ్డిదయింది. చెప్పేస్తాను; చంపండి. అంతకు తక్కువశిక్ష ఏదీ విధించవద్దు. (దుఃఖంతో పాదాలమీద పడుతుంది.)

కాంతా : (ఆశ్చర్యంతో) అన్నపూర్ణా! విచారంతో మతిచెడి మాట్లాడు తున్నావు. నువ్వేతప్పూ చేయవని నాకు బాగానమ్మకముంది. నాఎడలా, సంసార మెడలా నీలో ఉండే సుగుణాలకు మురిసిపోతుండేవాడిని. నిన్ను క్షమించ గూడని తప్పేమీ చేసిఉండవు.

అన్న : (ఉద్రేకం అపుకోలేక) చేశాను; నన్ను చంపండి. నాబిడ్డ జీవితాన్ని అంధ కారం చేశాను. ఆ భయంకరమైన అంధకారం నేనుచూడలేను. నిత్యకల్యాణంగా కనపడే ప్రపంచమంతా విషాదపూరితంగా, అగాధంగా, అగుపడుతోంది. నన్ను చంపండి! (పొర్లి ఏడుస్తుంది.)

కాంతా : నన్ను పిచ్చివాడిని చేసేస్తున్నావు అన్నపూర్ణా! నాకేమీ తెలియడంలేదు.

అన్న : ప్రసవమయ్యే ముందురాత్రి నా పాతివ్రత్యం తప్పాను. రామారావుతో స్వర్గ సీమకువెళ్లి గుభిల్లున అంధకారంలోకికూలాను. తప్పు, నాకూ, నా బిడ్డకూ, మీకూ అన్యాయం చేస్తున్నాననుకొంటూనే వశంతప్పి పోశాను. ఆ రాత్రే చాలాబాధలు పడుతూ మరునాడు ఈ పాపను ప్రసవించాను. ముమ్మారు కన్నాను కాని; ఇంతబాధ ఎప్పుడూ పడలేదు.

కాంతా : (దుఃఖాన్ని, రౌద్రాన్ని మింగుతున్నట్లుంటాడు.)

అన్న : మంత్రసాని చెప్పింది; తల్లికి-నాకు ఏదో అంటువ్యాధి ఉండడంవల్లనే పుట్టగానే బిడ్డకు కళ్ళుపోయాయని ! చంపండి ! నన్ను చంపేయండి ! ! (తల నేలకేసి బాదుకొంటుంది.)

కాంతా : ఆః ! ఆఃఃః !! (నోరు పెదపలేని అయోమయస్థితిలో ఉంటాడు.)

చంటిపిల్ల : (గగ్గోలుగా ఏడుస్తుంటుంది.)

కాంతా : (తమాయించుకొని) నిన్ను నేను చంపవలసినపనీ, శిక్షింపవలసినపనీ నాకేమీలేదు. నీ అఘాయిత్యానికి గురిఅయిన అంధురాలు ఈ పసిపాప నూరేళ్ళు వర్ధిల్లాలనిమాత్రం ఆశిస్తున్నాను. అదే నీకు శిక్ష ! ఆ దుఃఖమే నిరంతరం నిన్ను దహించేస్తుంటుంది. (పాపవంక అదే విధిగా చూడలేక మోకాటిమీద తలవాల్చుకొని దుఃఖిస్తుంటాడు)

అన్న : (దుఃఖంతో శోషవచ్చి మాటలేకుండా పడిపోతుంది)

చంటిపిల్ల : (అంధకారాన్ని బద్దలుకొడుతున్నట్లు పిక్కటిల్లి ఏడుస్తుంటుంది.)

—నల్లతెర రోదిస్తూ క్రమ్ముకొంటుంది.

△

= చాలని =

* ఆధునికాంధ్ర నాటక సమీక్షలు *

పఠితలకు

ప్రేక్షకులకు

శ్రోతలకు

విమర్శనాదృష్టిని కలిగించి

అభ్యుదయ దృక్పథాన్నిచ్చే సమీక్షల సంపుటి.

రచయిత :

డాక్టరు రాంబాబు

ఏలూరు.

# నిండుకుండ తొణికింది!

పాఠకులకు—

మార్క్సు - ఏంగిల్సుల స్నేహం చాలా ఆదర్శ ప్రాయమైనది. మార్క్సు బీదవాడు; ఏంగిల్సు ధనవంతుడు. వీరిద్దరిమధ్య అభేద్యమైన స్నేహం పెరిగి, అందులోనుండే "మార్క్సిజం" ప్రభవి ల్లింది. అది ఆనాడు వారిద్దరూ కన్న కల! నేడది జైత్రయాత్ర సాగిస్తోంది. అట్టివారి స్నేహమనే నిండుకుండ తొణికింది! 1863 జనవరిలో క్షణిక మైన వైమనస్యం కల్గింది. ఇది చాలా సున్నిత మైనది. ఈ సంఘటన వారి వర్గ స్వభావాన్ని ప్రతి బింబింపజేస్తుంది. ఆ వైమనస్యంకల్గడానికిఅప్పటి వారి విషాద పరిస్థితులను పునరాలోచించుకొని వా రిద్దరి స్నేహం తిరిగి దృఢతరం చేసుకొంటారు. ఆదర్శప్రాయమైన వారి స్నేహ జీవితంలో ఈ చిన్నఘట్టమే ఈ నాటిక! ఇందులో 1-3 గీతాలు శ్రీ తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారివి. 2 - వ గీతం శ్రీ రామచంద్ర అప్పారావుగారిది. వారికి నా కృతజ్ఞత!

రచయిత:

డాక్టరు రాంబాబు

ఏలూరు, 5-1-1949.

పాత్రలు :

మార్క్సు }
ఏంగిల్సు } ప్రాణస్నేహితులు

జెన్నీ : మార్క్సు సతీమణి

మేరీబరన్సు : ఏంగిల్సు ప్రియురాలు

హెలన్ : మార్క్సుకు మాతృ సమానురాలు

మూడు రోజుల పిల్లడు : మార్క్సు చిన్నబిడ్డడు

ముగ్గురు ఎడపిల్లలు : మార్క్సు పెద్దపిల్లలు

మార్క్సు ఇంటి యజమానురాలు –

ఇద్దరు పోలీసులు –

పోస్టుమాను –

అదృశ్యవాణి –

# ఏంగిల్సు పడకగది:

ఏంగిల్సు: (త్రాగేసిన గ్లాసు డ్రాయరుమీద పెడుతూ, మంచంమీద కూర్చుని పంట్లాం జేబులోంచి ఉత్తరంతీసి చదువుతూ...) "ప్రియమిత్రమా! మేరీ బరన్సు నిన్ను వీడిపోయినందుకు నా సానుభూతి!"... ఇవి నా ప్రాణస్నేహితుడు కారల్ మార్క్సు వ్రాసిన మాటలేనా? తక్కినదంతా తనగొడవే! నాబాధ నేమీ గ్రహించలేదు. తనకే యీ కష్టంవస్తే తెలిసేది. (పరుపుక్రిందనుంచి మేరీ బరన్సు ఫొటోతీసి) ప్రియమేరీ! నీ మరణానికి-కాదు; అంతర్ధానమైన నీ సౌందర్యానికి నా స్నేహకోటి అంతా సానుభూతి, సానుతాపాలు చూపారు. కాని, నా ప్రియ మిత్రుడు కారల్... (మంచంమీదపరుండి దీర్ఘంగా ఆలోచిస్తుంటాడు.) మేరీ! ఆఖరుసారిగా నీతో గడిపిన ఆ రోజెంత గొప్పది! (జ్ఞప్తికి తెచ్చుకొంటూ క్రమంగా స్వాప్నికజగత్తులోకి పోతూ) మేరీ! నీ మధురస్వరంతో ఒక పాటపాడి ఈ అలసిపోయిన హృదయానికి శ్రమదీర్చు.

= ఏంగిల్సు స్వప్నంలో =

మేరీ బరన్సు: (నిమ్మదిగా ప్రవేశించి)

కారుచీకటి పేరుకొనియెను
కడలి మ్రోతల మారుమ్రోగెను
దారుణంబగు నంధకారము
దారి తెలియదుగా!

అచ్చటచ్చట మిణుగురైనను
జొచ్చివెదకిన లేదుకనగా
హెచ్చుమోదము తోడ నేగెద
వేమి కనుగొనగా?

భయముగొల్పెడు కారుసంద్రము
బాగుగా గనుగొందువా, యట!
పారమెరుగని ఆ యెడారిని
భయము పుట్టదుగా!
చేటెరుంగవు పాటెరుంగవు
చెప్పినను వినరాదొకో, యట

కారుచీకటికి భోరుమనియెను
కడలి మ్రోతలతో!

(ఏంగిల్సు ప్రక్కన కూర్చుంటుంది.)

ఏం : మేరీ! నీమాటలోఉన్న హాయిని నా భయం మ్రింగేస్తోంది.

మే : (ఆశ్చర్యంగా) భయమెందుకూ? మనస్నేహంలో ఈ రోజే అత్యుత్తమమూ, ఆనందదాయకమూ, మరపురానిదిగా ఉండాలని కోరుకున్నాను.

ఏం : ఆనందమా? ఈ సమాజంలో అనుభవించే ఆనందం ఆనందమేనా? భ్రమపడుతున్నావు మేరీ! ఆనందమనేదాన్ని కొన్నితరాలనాడే దోపిడీవర్గం దోచేసుకొంది.

మే : నీవూ అందులోవాడివేగా?

ఏం : నిజమే! ఈ ఊబిలోంచి బైటపడాలని ఎంత ప్రయత్నించినా, నా శక్యం కాకుండా పోతోంది. ప్రయత్నంమీద నాకున్న అచంచలవిశ్వాసం నన్ను రక్షించగలదని ఆశిస్తున్నాను. అందుకు ధైర్యంగా నా ప్రాణస్నేహితుడు మార్క్సు ఉండనే ఉన్నాడు.

మే : మార్క్సు చాలామంచివాడు. ఎందుకనో, ఆయన్ని చూచినప్పుడు నాకళ్ళు చెమ్మగిల్లాయి. ఏడవబోయి తమాయించుకొన్నాను.

ఏం : నేనతిశయోక్తిగా అంటున్నా ననుకొంటావేమోగాని; ఆయన ముఖంలో ప్రపంచ బీద ప్రజానీకపు దైన్యం ప్రతిబింబిస్తూ ఉంటుంది; విశ్వశ్రేయస్సు తొణికిసలాడుతూ ఉంటుంది.

మే : అటువంటివాడికే కష్టాలన్నీని!

ఏం : ఆ మహాపండితుని ఆర్థికబాధతీరిస్తే ఆయన ప్రపంచమానవులనే ఒక్కసారిగా చైతన్యంలోకి తీసుకుపోగలడు. శాంతి అభ్యుదయాలను పరుగులు తీయించేవాడు. కాని ఆ నిస్సహాయునికి సహాయం చేయలేనిస్థితిలో— నా తండ్రిక్రింద నికృష్ట బానిసత్వ మనుభవిస్తున్నాను. ఈ బాధతోనే నిరంతరం క్రుంగిపోతున్నాను. (కన్నీరు రాలుస్తాడు.)

మే : (ఏంగిల్సుకి కన్నీరు తుడుస్తూ) ఒక మిత్రుని దీనస్థితినిగూర్చి ఏకగర్భజనితునిలా దుఃఖించే మిమ్మల్నే చూచాను. ఇంత నవనీతసదృశమైన మీ హృదయం మీ శాస్త్రాలగుండా పరిణమించే విప్లవాలను ఎలా తట్టుకోగలదో?

ఏం : న్యాయానికీ, దయకు పరితపించని హృదయం హృదయమే కాదు; అది ఇనుపగుండె! అది దోపిడీముఠాలకుంటుంది. ఆ ఇనుపగుండెనే అన్యాయాన్నీ, అసమానత్వాన్నీ, అణగద్రొక్కడానికే మే ముపయోగిస్తాము.

మే : మీ జన్మే చాలా విపరీతంగా ఉంది. అగర్భశ్రీమంతుల ఇంటపుట్టి ధనికులను ద్వేషించడం, బీదమార్క్సుతో స్నేహంచేస్తుండడం, చాలా ఆశ్చర్యంగా ఉంది.

ఏం : మేరీ ! కారల్‌తో నా స్నేహం నీకూ విపరీతంగాతోస్తే నిన్ను ప్రేమించలేను.

మే : ప్రియా ! నన్ను వేరే అర్థంచేసుకోవద్దు. క్షణికమైన ప్రేమకు నన్నూ, విశ్వవిశాలమైన ప్రేమకు మార్క్సునూ, మీరు స్నేహంచేస్తున్నారని నేను తెలుసుకోలేకపోలేదు.

ఏం : మేరీ ! నీ గానామృతం మళ్ళా ఒకసారి త్రాగించు.

మే : విచారంగా నీ వీ రోజు గడపడంబాగోలేదు. ఇవాళ చాలా కులాసాగా నీతో గడుపుదామనుకున్నాను. (ఏంగిల్సు ముఖంలోకి చూస్తుంది.)

ఏం : (చిరునవ్వు నవ్వుతాడు)

మేరీబర్న్సు :

నిన్నే కోరుదునోయి ! ఇతరుల
నెన్నడెరుగని దాననోయీ !
నాడు నేడే నాటికిని నీ
దాననే నోయీ !

మనసు నాకేకాంత మోయీ !
బ్రతుకు నాకు ప్రశాంతమోయీ !
అంద మాముద దీప మోయీ !
వలపె నే నోయీ !

సొగసుపువ్వులు సోలు ముద్దులు
వలపు పన్నీరుల తుషారము
వెలుగుతేటల పసిడిపువ్వులు
కానుక నీ కోయీ !

(ద్రాక్షపానీయం అందిస్తుంది.)

ఏం : (ఏంగిల్సు త్రాగి అలాపరుండిపోతాడు. మేరీ నిష్క్రమిస్తుంది. కొంతసేపటికి కల కరిగిపోతుంది.) కల ! అంతా కల ! మేరీతో ఆఖరిరోజు నాకు మరపు రానీయడంలేదు. ఆ అమృతక్షణాలు నా యువజీవితంలో మరపురానివి. ఈ బాధ

నాజీవితమున్నన్నాళ్ళూ భరించవలసిందే! మేరీ! భౌతికవాదినైన నన్ను పగ తీర్చుకొనడానికే ప్రేమదేవతవై పుట్టిపోయావా? (చేతిలోఉన్న ఉత్తరం కన్నీటితో తడిసిపోతుంది.)

అదృశ్యవాణి :

...జీవితమున కంతా అది
చెలువపు నిగ్గేమో,
పరమప్రేమకు చిహ్నమైన తెలి
వెన్నెలకాంతుల
సన్నపుతళుకేమో !

—తెర.

# 2

## మార్క్సు పడకగది :

మార్క్సు : (చెల్లాచెదురుగా పడిఉన్న పుస్తకాలమధ్య- పంట్లాంజేబుల్లో చేతులు పెట్టుకొని- పచారుచేస్తూ, హఠాత్తుగా పడకకుర్చీలో పడుకొని పంట్లాం జేబులోని ఉత్తరం తీసి చదువుతూ...) "కారల్! నే నీ రోజువరకూ నిన్ను ప్రియ మిత్రుడ వనుకున్నాను; కాని ఈ ఉత్తరంలో నిన్నలా సంబోధించడానికి గాయ పడిన ఈ మనసొప్పడంలేదు. ప్రియమేరీ నన్ను దుర్భర వియోగాగ్నిలో పడవేసి పోయినదానికంటే; నీవు నన్ను నీఉత్తరంతో చాలా బాధపెట్టావు. నావలపుల వెన్నె, నా మయూరం, నా ప్రేమలహరి, నా జీవనోదయతార, నా సర్వస్వం,- మేరీ బరన్ను పోయిననాడే నా భౌతికకాయం, నీస్నేహ శరీరంకూడా పోయిం దనుకో. ఆ వియోగాగ్నిలో ఉండికూడా నీ వొచ్చి ఎంతగానో నన్నోదార్చు తావనేఆశతో నీకుత్తరంవ్రాశాను. దానికి నీవు నీ సానుభూతిని ఒక్కమాటతో లాంఛనం తీర్చుకొన్నావు. దానిభావం మేరీ నన్ను విడిచిపోవడం అంత ప్రధాన విషయం కాదనుకొన్నావా? నాకుసంభవించిన ఈ వియోగానికి నా శత్రువులు సైతం నావద్దకువచ్చి ఓదార్చారు. నాకు తెలియనివారెందరోకూడా స్వయంగా వచ్చి సానుభూతిని తెల్పారు. వారందరినీమించి నీవువచ్చి ఏదో శీతలోపచారం చేస్తావనుకొన్నాను. అది సున్న! దాన్నిబట్టి నీతోస్నేహం ఇంతవరకే నను

కొన్నాను. ఇప్పుడు నా హృదయతంత్రుల్లో రెండు తెగిపోయాయి. ఒకటి : నాజీవితనిధానం ప్రియ మేరీ ; రెండు : నీతో స్నేహం !

— "పెడగిక్ ఏంగిల్సు"

(ఉత్తరం మడుస్తూ) మిత్రుని ఎంతబాధపెట్టానో ! అత నాశించినంతగా నా సానుభూతిని తెల్పలేకపోయాను. ఈ నిత్యదరిద్రునికి స్నేహకోటికూడా దూరమై పోతోంది. ఈ ఉత్తరం వచ్చిన ఆ రోజెంత విషాదపూరితమైనది ! (పశ్చాత్తాపంతో ఆలోచిస్తూ క్రమంగా స్వాప్నికజగత్తులోకి పోతాడు.)

= మార్క్స్ స్వప్నంలో =

హెలన్ : (విచారంగా ప్రవేశించి) నాయనా కారల్ ! చంటోడు చాలా బాధ పడుతున్నాడు. అలాచూడు ! ఆ బాధను చూడ్డంకూడా చాలా కష్టంగాఉంది.

మా : చూడలేను తల్లీ ! (కన్నీటిబొట్లు రాలుస్తూ) ఇప్పటిదాకా డాక్టర్లకోసం తిరిగి వచ్చాను. ఒక్కరూ ఫీజు ముందీయనిదే రావన్నారు. చేతిలో చిల్లిగవ్వలేదు. జెన్నీ ! ...

జెన్నీ : (బిగ్గరగా దుఃఖిస్తూ, కుక్కిమంచంలో అవసానదశలో ఉన్న బిడ్డను చూస్తూ ఉంటుంది. ముగ్గురు ఎడపిల్లలు, నీరసంగా నిలబడి ఏడుస్తుంటారు.)

మా : (జెన్నీని సమీపిస్తూ) దుఃఖించకు. అనుభవాలు చాలా కఠిన్యాలు. మనలాంటి దరిద్రులు, అన్నివిధాలా జీవితమే అంధకారంగా గలవాళ్ళు ప్రపంచంలో కోట్లాదిగా ఉన్నారు. ఈ సమాజంలో ఈ కష్టాలు సహజం. అనివార్యాలు !

హెలన్ : ఏడవకు జెన్నీ తల్లీ ! మూడురోజులనుంచి తిండిలేదుసరికదా; పైగా ఒక్క పట్టున అలాఏడుస్తున్నావు. నాయనా, కారల్ ! పెద్దది—లాంగెట్ ఎక్కడో రొట్టితెచ్చింది. అది తినయినా కాసిని నీళ్ళుత్రాగు తండ్రీ !

మా : (పొంగుకొస్తున్న దుఃఖాన్ని అణచుకొంటూ) పెద్దది ఎక్కడైనా అడుక్కు తెచ్చుకొంటోందా ? హుం ! దరిద్రం రెమ్మలువేస్తోంది... బిడ్డల నోటివద్ద తిండి కూడా తినాలా ? (తలుపు తట్టినచప్పుడు) ఎవరోచూడు !

హె : (తలుపులు తీయగానే ఆ యింటియజమానురాలు, ఇద్దరు పోలీసులు ప్రవేశిస్తారు. ఇంటిలోనివారంతా నిశ్చేష్టులైపోతారు. ఇంటియజమానురాలితో ఆశ్చర్యంగా) ఈ పోలీసు లేమిటి ?

ఇంటి యజమానురాలు : (పోలీసులతో లోపలికి ప్రవేశిస్తూ) నిన్ననే మీకు చెప్పి పోయాను. రెండు వందల రూపాయలు జాగ్రతగా ఉంచారా ? లేదా ?

మా : (దీనంగా) చాలా ఇబ్బందిగా ఉంది.

ఇం. య : అలా కాను ; ఇప్పుడు కావాలి! (దుఃఖిస్తున్న జెన్నీని, చనిపోతున్న పిల్లడినీ, బిక్కచరాలై నిలబడున్న ముగ్గురు పిల్లలనూ కదిలలుముంలలా చూస్తూనే ఉంటుంది.)

హా : బాధలు చూడు! బిడ్డకు ప్రాణంమీదకువచ్చింది. పిల్లలకైనా తినతిండిలేదు. నీ కోరిక ఇప్పు డెలా తీర్చడం చెప్పు. మా బాధలు గ్రహించి, ఆ బిడ్డల ముఖాలైనా చూచి కొద్ది రోజు లాగు. (పోలీసులు లాంతరు, పిల్ల లాడుకొనే బొమ్మలు, ఊయల, బట్టలు, పుస్తకాలు వీధిలోనికి గిరాటేస్తుంటారు. అడ్డంవచ్చిన మార్క్సును మెడమీద లాఠీలేసి పడేస్తారు.) బిడ్డలగలదానివి. నీ కిది తగదు. తీసుకొన్న అద్దాన్నయినా తీరకముందే తిరిగి రెండు వంద లిమ్మని ఈ కష్టకాలంలో ఈ హంగామా అంతా చేస్తున్నావు.

ఇం. య : అలాగే! ఇంకో రెండుగంటలలో మళ్ళావస్తాను. ఇస్తావా డబ్బియి; లేదా ఖాళీచేసేయి. రండి! (అంటూ పోలీసులతో వెళ్ళిపోతుంది.)

హా : ముదనష్టపుముండ!

మా : (నిశ్చలంగా) నికృష్టసమాజానికి ప్రత్యక్షచిహ్నం!

జె : (బిడ్డమీదపడి దుఃఖిస్తూ ఉంటుంది. పిల్లలు భీతిల్లి ఏడుస్తుంటారు.)

పోస్టుమాన్ : కారల్ మార్క్స్! (పిలచి ఉత్తరం ఇచ్చిపోతాడు.)

మా : (ఉత్తరం చదువుతూ ఆశ్చర్యంగా) మేరీ బరన్సు హఠాత్తుగా పోయింది. పాపం! ఏంగిల్సు దుఃఖసాగరంలో ఉన్నాడు. (చెమ్మగిలినకళ్ళు తుడుచుకొంటాడు; కలవిరిగిపోయి సెలకువవస్తుంది. లేచి కూర్చుని) అబ్బా! తిరిగి ఆ రోజు నన్ను ఎంతబాధ పెట్టింది! ఆ రోజున నాకుకల్గిన అష్టకష్టాల్లో ఊపిరి సల్పుకోలేక ప్రియస్నేహితునికి సానుభూతి సరిగా తెల్పలేకపోయాను. ఏంగిల్సు! క్షమించు. నీ ప్రియురాలి వియోగానికి నా సానుభూతి మనస్ఫూర్తిగా తెల్పుచున్నాను. చిరుక్కుమన్న మన స్నేహం దృఢతరమై మానవశ్రేయస్సును కంచుకాగడాలతో వెదికి సాధించాలని ఆశిస్తున్నాను. (చేతిలోఉన్న ఉత్తరం చదుటకూ, కన్నీటికీ తడిసి పోతుంది. ఆలోచనలో శూన్యంలోకి చూస్తుంటాడు.)

అదృశ్యవాణి :

నిరాశాపూరిత నిస్పృహా జ్వాలితము
అగ్నిగుండ మల్లదిగో!...
శాంతి సౌఖ్యముల ఉషఃకాంతులు
సాగే సమయమ్మదిగో!

రండీ రండని పిలచే శక్తుల
దండు దాడు లల్లవిగో !
ఎడదలు పొంగి, ప్రతిభలు పెరిగే
నూత్న జగ త్తల్లదిగో ! అదిగో !...

(ఎర్ర తెర పడిఉంటుంది. ఆ తెరమీద మార్క్స్-ఏంగిల్సుల దృఢతర స్నేహాన్ని తెలిపే - వారిద్దరి ఫొటో తగిలించి ఉంటుంది. దానిక్రింద "ప్రపంచ కార్మికులారా ! ఏకము కండు !! విప్లవం వర్ధిల్లాలి !!!" అని వ్రాసి ఉంటుంది.

అదృశ్యవాణి :

కలలై, తీరని కోరికలై
పోయినవాటిని సాధించే
మీ స్నేహం ఒక జైత్రయాత్ర !

తరాలుగా, అర్బుదాలుగా, పేరుకొన్న
అనాగరికతను, అజ్ఞానాన్ని
ఛేదించే మీ స్నేహం ఒక వజ్రం !

నవజగత్తున పూసే, వికసించే,
హృదయాలకు, ముందున కురిసే
అభ్యుదయానికి, మీ స్నేహం, ఒక కాంతి !

△

# మహాకవి : జాన్ కీట్సు

ఈ నాటిక, మహాకవి : జాన్ కీట్సు చరిత్రాంశమే ! ఇందుపయోగించిన 1, 2 గీతాలు, శ్రీ కొడవటిగంటి వెంకట సుబ్బయ్యగారివి ; 2 వ గీతం శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిది. వారికి నా కృతజ్ఞత !

పాత్రలు :

జాన్ కీట్సు : మహాకవి ; ప్రేయసీవియోగి ; క్షయరోగి

థామస్ కీట్సు : జాన్ కీట్సు తమ్ముడు ; క్షయరోగి

ఫేనీ బ్రౌన్ : జాన్ కీట్సు ప్రేయసి

బైరన్ : } జాన్ కీట్సు మిత్రులు ; మహాకవులు
షెల్లీ : }

అదృశ్యవాణి –

★

# చీకటి రాత్రి :

క్షయరోగగ్రస్తుడైన తన తమ్ముడు థామస్ కీట్సు శయ్యదగ్గర మహాకవి : జాన్ కీట్సు విచారంతో కూర్చున్నాడు. జాన్ కీట్సు ప్రేయసి ఫేనీ బ్రౌన్ తన కేమీ పట్టనట్లు నుంచునుంది.

థామస్ : (మాట్లాడలేనిస్థితిలో ఆయాసపడుతూ) అన్నా ! నీవు జీర్ణించుకొంటున్న అనంతమూ, అగాధమూ, అయిన బాధలు నీ కళ్ళల్లో దాడలేక పోతున్నాయి.

కీట్సు : (తమ్ముని చేయిపట్టుకొని) థామస్ ! భూమ్మీదపడిన క్షణం లగాయితూ ఈ జీవితమే దుఃఖభాజనం ! చీకటుల సంఘటన; దుఃఖాలజీమూతం. దానిలోనే వెలుగును చూచుకొని తన్మయులౌతున్నాం... ఒక్కనేనే బాధలు జీర్ణించుకొనడంలేదు; అసలు ఈ విశ్వమే జీవన్మరణాలమధ్య ఊగులాడుతూ, బాధల్ని జీర్ణించుకొంటూ, సృష్టిని పోషిస్తోంది...మాట్లాడకు తమ్ముడూ! ఆయాసంవస్తుంది. (విచారిస్తూ కూర్చుంటాడు.)

థామస్ : ఎంతటి చీకటినైనా నిర్మల హృదయాల్లోపుట్టు ప్రేమజ్యోతులు విరి చేస్తాయిగా అన్నా ? నన్నుగూర్చిగా నీకంత విచారం ? శాశ్వతంగాని ఈ ఈ శరీరంతో అనంతంలో లీనంకాకుండా ప్రయత్నిస్తావెందుకు ? దుఃఖవారధిలో మునిగిపోకుండా కాపాడబోతావెందుకు ? ప్రేమకు ఆస్కారమైన ఈ హృదయాలను రక్షించడానికి ప్రయత్నించరాదా ? ఫేనీవదినా... నన్నుగూర్చి అన్నను విచారించనీయకు; దూరంగా నిల్చుంటావేంవదినా ? ఇలావచ్చి నీచల్లటిమాటల్తో అన్న విచారాన్ని చల్లార్చు.

ఫేనీ : (నిర్లక్ష్యంగా) ఎవరూ దేనికీ విచారించ నవసరంలేదు ; విచారించేవారిని ఓదార్చడ మనేది ఎండిపోయిన మ్రానును చిగిర్చింపజేసే ప్రయత్నంలాంటిదే !

థామస్ : (ఆవేశంతో) మోహకారకమైన ప్రేమజీవితాలను పెంచింపడం నాకు నచ్చదు వదినా ! మన అభ్యుదయానికి ఈ ప్రకృతిలో సర్వం తమతమ వంతును త్యాగంచేస్తున్నాయి. అందులో ఎంత సానుభూతి, భూతదయ, సౌభ్రాతృత్వమూ లేవు ? లోకంలో విచారించడ మనేది అంతంకావడమంటే మానవుల హృదయాల్లో ప్రేమ ఇంకిపోవడమన్న మాట ! అ-బ్బా ! (మూలుగుతాడు)

కీట్సు : థామస్ ! నీ బాధలు చూడలేని, తీర్చలేని, నీఅన్న గ్రుడ్డివాడై, చెవిటివాడై, మూగవాడైపోతున్నాను. ఈ దుఃఖ గీతికల్ని నా హృదయవిపంచి ఆలపించేశక్తిని సైతం కోల్పోయింది. తమ్ముడూ ! నీ కీ జబ్బు రావడం నా కుడిభుజం కూలిపోవడమే ! ... ఫేనీ బ్రౌన్ ! చూడు. తమ్ముడు ఐహికక్లేశాల్ని అధిగమిస్తున్నాడు. (కన్నీరు కార్చుతాడు.)

ఫేనీ : ఎందుకు అలా దుఃఖించడం ? నీ తమ్ముడు త్వరలో కులాసా పొందుతాడని డాక్టరు చెప్పాడుగా ! నే పోతున్నాను; బీచ్ కి పోవాలి. (వెళ్ళిపోతుంది.)

కీట్సు : ఈ జీవితం దుఃఖపాశాలతో మరింత బిగింపబడుతోంది. ఫేనీ! నీహృదయానికి నన్ను దూరంచేసుకుంటున్నావా ? సోదరా ! సౌభ్రాతృత్వాన్ని నీతో తీసుకుపోతున్నావా ?

థామస్ : (మరణవ్యథతో) అ-న్నా ! అన్నా !!

కీట్సు : జీవితాన్ని ఆశలతో అల్లుకొంటే ఎప్పటికైనా చిక్కులు పడిపోకతప్పదు. ఫేనీని ఆధారంగా అల్లుకొన్న నాఆశలన్నీ విడదీయలేని చిక్కుల్లోపడిపోయాయి. ఏమిటి తమ్ముడూ ! నన్నలా చూస్తావు ?

థామస్ : అన్నా ! నీవుకూడా రోగిష్టివైపోతున్నావు. చూచుకో ! నీగుండెలార్చుకుపోతున్నాయి. క్షణక్షణం కృంగిపోతున్నావు. (గంభీరంగా) అన్నా ! నాకీ దుర్భరవ్యాధి కలిగిందనేనా నీ విచారం ? ఫేనీ నీకు అన్యాయం చేస్తోందనేనా నీచింత ? విషాదపూరితమైన జీవితాన్నే భరిస్తున్నప్పుడు అందులోవచ్చే కెరటాల్ని తట్టుకోవద్దా ? మహాకవివైన నీవు దుఃఖాన్ని అధిగమించి మహావ్యక్తివి కావాలి !

కీట్సు : థామస్ ! నేనూ రోగినైపోతున్నానా ? పట్టిది ! దుఃఖాన్ని అధిగమించడమేమిటి- వాటిల్లో మునిగి తేలుతూ పవిత్రుడనుకూడా అగుతున్నాను. (కన్నీరు తుడుచుకొంటూ) నా ప్రేమనంతా ఫేనీప్రేయసి సుందరమూర్తిలో దాచుకొన్నాను ఫేనీ బ్రౌన్ నిరాశాజ్వాలలు ముట్టిస్తోంది.

థామస్ : అన్నా ! దుఃఖించకు. చిన్నవాళ్ళమైనా ఉండీకూడా ఎందరికి ఆదర్శంగా, అభిమానంగా, ఉన్నామో తలచుకొంటే నీ దుఃఖమే నీ ఎదను సంప్రశీతలమై ఆనందాన్నిస్తుంది.

కీట్సు : ప్రేమకై పుట్టాను; ప్రేమకై జీవిస్తున్నాను. ప్రేమించాను; ప్రేమిస్తాను. గాఢపరిష్వంగంలో, దీర్ఘ వినోదంలో, పూవులో, తావిలో, చిగురులో, ప్రమోదంలో, ఖేదంలో, నాదంలో- అన్నింటిలోనూ ప్రేమను అనంతంగా ఆస్వాదిస్తాను.

థామస్ : ప్రేమ అనుకొని సత్యజగత్తును మరచిపోకు అన్నయ్యా ! ఫేనీ ప్రేమించని ఎంతలో నీ జీవితం వ్యర్థమా ? మన కన్నతల్లి మనల్ని వివిధ విపత్సమయాల్లోనూ కాపాడి నిన్ను ఆ ఫేనీపై ప్రేమకూ, నన్ను ఈ మశ్చరవ్యాధికీ, బలికమ్మని పెంచినదా ? వీటిని జయిస్తేనే మాతృఋణం తీర్చినవారమౌతాం. నన్ను మాత్రం ఈ భయంకరవ్యాధి తుదిక్షణాలకు తీసుకుపోతోంది. నీకైనా - ..... (కళ్ళు తేలవేసి, మరణిస్తాడు.)

కీట్సు : (ఉబికి పొర్లుతున్న దుఃఖంతో) తమ్ముడూ, తమ్ముడూ ! ఫేనీ నింపుతున్న దుఃఖవారధికి గండ్లు కొడుతున్నావా ? నన్నూ, ఇహంలో ఉండే ప్రేమనూ విడిచిపోతున్నావా ! (దుఃఖిస్తుంటాడు.)

= షెల్లీ బైరనుల రాక =

కీట్సు : రండి ! తమ్ముని క్షయ మ్రింగేసింది. ఆప్తమిత్రులారా ! నా జీవితంలో మొదటికష్టం అనంతంలో కలసిపోయింది... థామస్ ! (తమ్మునిపైబడి దుఃఖిస్తూ) నీ ఆఖరుక్షణాలు చూడ్డానికి వచ్చిన మిత్రులు బైరన్ షెల్లీలను పలకరించవా ?

షెల్లీ : (కీట్సు దగ్గర చేరి) నామీద దయయుంచి లే ! కీట్సు మిత్రమా ! లోకం నిన్ను పిలుస్తోంది. నీ సేవనూ, సందేశాన్నీ ఆశిస్తోంది. నీ దుఃఖమే దుఃఖమనుకొంటే విషాదభూయిష్ఠమైన ఈ లోకాన్ని ఓదార్చేదెవరు ?

బైరన్ : (కూలబడి దుఃఖాన్ని దిగమ్రింగుతుంటాడు.)

షెల్లీ : లోకకంటకుల్ని మించి ఈ క్షయవ్యాధి ఏర్పడింది. ప్రజాపీడకులు భక్షించగా మిగిలిన సారహీనమైన ఆహారాన్ని- పిప్పిని- సేవిస్తుండడంవల్లనే ఈ ఘోరవ్యాధి ప్రబలుతోంది. లోకంలో ప్రేమ జయించాలంటే ప్రజాపీడకులతోపాటు ఈ క్షయవ్యాధిని నశింపజేయాలి ! విశ్వాన్ని ఆర్ద్రించేసే ఎన్ని కోమలహృదయాలను ఈ క్షయవ్యాధి బలిగొందో ! ప్రేమజ్యోతులు వెలిగే ఎన్ని ప్రమిదలను ఈ వ్యాధి బద్దలుకొట్టిందో ! మిత్రమా కీట్సు ! దుఃఖించకు.

కీట్సు : తమ్ముడూ థామస్ ! నీతోపాటు నన్నుకూడా అనంతంలోకి తీసుకుపోయి నా దుఃఖవాహినిలో సంతోషతరంగాలు లేపు. ఈ ఘాఢజీమూత పరివ్యాప్తజీవికి ఆనందజ్యోతులు చూపించు. ప్రేమించిన హృదయాలతో ప్రేమింపబడలేని నే నింకా బ్రతికేందుకూ ?

బైరన్ : (కీట్సు ముఖంలోకి చూస్తూ) మిత్రులమాట విను. జీవితంలో తప్పని సరిగావచ్చే ఈ కష్టాల్ని కూడా తట్టుకోవాలి.

కీట్సు : తమ్ముడూ, తమ్ముడూ ! (శోషవచ్చి పడిపోతాడు.)

అదృశ్యవాణి :

"ఆఁగు, మాఁగుము తెరువరీ, ఆ
యాస ఖేదము నపనయింపుము,
మా గృహాంగణ కుసుమ సముదయ
మధువు లియ్యవిగో !"

# 2

# వెన్నెల రాత్రి :

ఆరుబయట కుర్చీలో పడుకొని మహాకవి : జాన్ కీట్సు దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు ; ప్రక్కనున్న కుర్చీలో ఫేనీ బ్రౌన్ కలతనిద్రలో ఉంది.

జాన్ కీట్సు : (ఫేనీబ్రౌన్ భుజాన్ని తట్టుతూ) ఫేనీ ! నా హృదయం దొంగి లించిన నా ప్రియమైన ఫేనీ బ్రౌన్ ! నా కావ్యాలన్నీ వెలువడింది నీ సౌందర్య మూర్తినుండేనా ? నా హృదయం వలకబోసిన కారుణ్యరసమంతా నీ మృదులాధర మంజులామృతాన్ని గ్రోలేనా ?... ఫేనీ ! ఫేనీ ! నెలకువలేని నీ హృదయం ప్రక్కనున్న నన్ను ఈ వెన్నెల భయపెడుతోంది ; నా భయంతీర్చు. (ఫేనీ బ్రౌన్‌ని కుదుపుతాడు.)

ఫేనీ : (మేల్కొంటూ, విసుగుతో,) అ- బ్బా ! వెన్నెల భయపెడుతోందా ? అర్థంకాని నీ మాటలు వినలేక నీతోనే వేగిపోతున్నాను.

కీట్సు : ప్రియా ! నా హృదయంనుంచి నన్ను దూరంచేస్తున్నావని నాకు భయం వేస్తోంది. నీ ప్రేమపాశాలతో నన్ను బంధించి కాపాడవా ?

ఫేనీ : ఓం. వెన్నెల భయపెట్టడం, చీకటి సంతోషాన్నివ్వడంలోగల సౌఖ్యం, ఆనందం, నీగ్గాని, నా కేమిటి ? నిద్ర చెడగొట్టడం కాకపోతే నన్నెందు కిప్పుడు లేపాలి ! (చీదరించుకొంటుంది.)

కీట్సు : ప్రేమజీవని. నా హృదయంలో ప్రేమజ్యోతు లుంచుకొని నీ సౌందర్య మూర్తికి నివాళులెత్తుతున్నాను. ... నన్ను ప్రేమించవా ?

ఫేనీ : నీ తాహతుకు నిన్నింతకంటే ప్రేమించలేను.

కీట్సు : అయితే నా ప్రేమనైనా కాపాడలేవా ?

ఫేనీ : ఇంతకంటే నా చేతగాదు; ఆమాటకువస్తే నిన్ను నేనసలు ప్రేమించలేకుండా ఉన్నాను.

కీట్సు : ఆం. నా తమ్మునిలా నీవుకూడా దుఃఖంలో ముంచిపోతావా ! (ఆకాశం వంక చూస్తూ) ఓ వెన్నెలా ! నీకూ వియోగబాధ ఉందా ? ఎందరు ప్రేమ జీవులు నీ చల్లటి వెలుగుల్లో సౌఖ్యరాశి నోలలాడడంలేదు ! నేనేనా నా ప్రియురాలి ప్రేమను చూరగొనలేని మందభాగ్యుడను ?

ఫేనీ : ఓయి, పిచ్చివాడా ! నీ కవితాభాషలోనే చెప్పాలంటే నా గుండెలు నీ కవిత్వానికి పరిహాసంగా నవ్వుతున్నాయి. (విరగబడి నవ్వుతుంది.)

కీట్సు : (ఫేనీ బ్రాను చేతులుపట్టుకొని) ప్రియ ఫేనీ ! గతమంతా మరచిపోతాను; నీవుకూడా మరచిపో. నీయందు నాకున్న అనుమానమంతా చీకటిసాగరంలో కలిపి మరచిపోతాను. నిర్మలహృదయాలతో క్రొత్తదంపతుల మౌదాం. నిన్ను విడిచి క్షణముండలేను; నా గౌరవప్రతిష్ఠలు కాపాడు.

ఫేనీ : మళ్ళా జన్మించడ మెంతఅసంభవమో గతాన్ని మరచిపోవడంకూడా అంతే ! నీతో నేనిక దాంపత్యం చేయలేను.

కీట్సు : ఈ ఆశాజీవిని త్రుళ్ళబెట్టకు. చిన్నవయసులోనే దుఃఖాగ్నులకు గురిఅయి భస్మీభూతంకానున్న నాపైన ప్రేమార్ద్రదృష్టులు చిలుకరించు. నీ మధురస్వరంతో నా హృదయవిపంచిని మీటు. నా ప్రియా ! నీ ప్రేమచ్ఛాయల్లో నా కవితా హృదయాన్ని లోకానికి విప్పి చెప్పనీయి.

ఫేనీ : (ఖచ్చితంగా) దాంపత్యం పరస్పరం అర్థం కాకుండాఉంటే జీవితంలో సౌఖ్యాన్ని పొందలేదు. నీవు కవివైనంత మాత్రాన నీమీదే ప్రేమనిలుపుకోవాలని ఎక్కడుంది ? నీతో నేనిక ఉండను; ఉండలేను; ప్రేమించలేను.

కీట్సు : అయితే నీవు నన్ను ప్రేమించడానికి నేనెలా ఉండాలి ?

ఫేనీ : నీవెలామారినా యిక నీ సహచారిణిగా ఉండలేను. ఈమాట నీతో చెప్పడానికే చాలారోజులుగా ఆలోచిస్తున్నాను. ఇక నే వెళ్ళిపోతున్నాను. నిన్ను భయపెట్టే వెన్నెట్లో నేను హాయిగా పోతున్నాను. (రయ్యిమని వెళ్ళిపోతుంది.)

కీట్సు : (గద్గదతో) ఆఁ నా ఫేనీ ! నీకు నేచేసిన ద్రోహమేమిటి ? తటిల్లతలాపోతున్న నా ఆశాలతను ఈ ప్రేమజీవి అందుకోగలడా? మబ్బుల్లోకిపోయిన ఓ వెన్నెలా ! ఈ వియోగాగ్నిలో నేను దహనమై పోవలసిందేనా ? ఈ దుఃఖాగ్నిలో భస్మమై పోవలసిందేనా ? (కళ్ళుమూసుకొని లోలోన దుఃఖిస్తుంటాడు.)

= షెల్లీ బైరనులరాక =

కీట్సు : రండి ! ఈ శూన్యంలో విలపించనీయకుండా మీరిప్పుడు వచ్చారెందుకు ? మీ కావ్యవస్తువుగా ఈ నిర్భాగ్య కీట్సు మీ కుపయోగిస్తాడా ?

షెల్లీ : కీట్సు పిచ్చిమానవుడు.

బైరన్ : అంతేగాదు; ప్రేమోన్మాదికూడా.

షెల్లీ : మరింకా ప్రేమతో మోసగింపబడినవాడు.

కీట్సు : అందులోనే బూడిదనుకూడా అయిపోతున్నాను... విషాద పూరితమైన ఈ జీవితాన్ని వియోగంపాలు చేయవద్దని ఫేనీని ప్రార్థించి విఫలుడనైనాను. ఫేనీ నా పుండును రేపిపోయింది.

షెల్లీ : ఫేనీ నిన్ను విడిచిందని విలపిస్తావెందుకు ? నీవు విలపించదగిన గుణవిశేషాలు ఆమెవద్ద ఏమీలేవు. నీవు విలపించి సానుభూతి చూపదగిన ఈ పేద జనాల ఎముకల గరగరలు, భవిష్యత్తును నిర్మించే పేదపాపల ఆకలిగొంతులు, ఎండిపోయిన కోటి కంఠాలతో విలపిస్తోన్న నిర్భాగ్యుల హాహాకారాలు, నీకు వినిపించడంలేదా ? వాళ్ళగూర్చి విచారించరాదా ?

కీట్సు : మిత్రులారా ! నన్నేడవనీయండి. ప్రేమకూ, కలవృషకూ, దూరమైన నన్నేడవనీయండి. ఈ ఏడుపులోనే అనూహ్యానందం, అచంచలప్రేమా, నన్నాస్వాదించనీయండి. నా ప్రియ ఫేనీ అరుణాధరాల్లో విశ్వసౌందర్యాన్ని తిలకించనీయండి. నా కళాధిదేవి మృదుకపోలాలలో ప్రేమప్రతిబింబాన్ని చూడనీయండి. నా మధురభాషిణిలో ప్రేమజీవుల విజయభేరీనినాదా లాలకించనీయండి !

షెల్లీ : ప్రేమించు. కానీ, దానిలో ఉక్కిరిబిక్కిరై కొట్టుకుపోకు.

బైరన్ : అంతేకాదు. ప్రయోజనం సాధించు. ఫేనీ నిన్ను విడిచిపోలేపోయింది. నీ ప్రేమామృతాన్ని బాధితహృదయాలపై వర్షించు.
కీట్సు : అ - బ్బా! భరించలేనిబాధలు నన్ను క్రుంగదీస్తున్నాయి. (సోలిపోతాడు)
అదృశ్యవాణి :

"ఎవ రో హో, ఈ నిశీధి
నెగసి, నీడవోలె నిలిచి
పిలుతు రెవరో, మూగకనులు
మోయలేని చూపులతో
ఎవ రో హో!
ఎవ రో హో!
ఇపుడా నను బలుకరింతురు!
మ్రోయలేని నీరవగళ
మున జలించు కోరికతో
ఇపుడా నను బలుకరింతురు!
ఎవరని ఈ రేయి నిదుర
హృదయ మదర, వేయిజేయి
చాయలాడ పెనుచీకటి
సైగలతో నాకన్నుల
ర క్త మురల లాగికొందురు!
ఎవరో నా హృదయనాళ
మేలా తునియలుగా నా
నిర్జీవపు జీవితమ్ము
నిట వదలుదురా!
ఎవ రో హో!
ఎవ రో హో!
ఇపుడా నను పలుకరింతురు?

# 3

# అస్తమయం:

మహాకవి : జాన్ కీట్సు క్షయరోగంతో చిక్కి, శల్యమై అవసాన దశలో ఉన్నాడు; సమకాలిక కవిమిత్రులు షెల్లీ, బైరన్‌లు పరిచర్య చేస్తున్నారు.

బైరన్ : (దూరంగా కూర్చుని) నా మాట వినకుండా చేతులారా ఈ వ్యాధి తెచ్చుకొన్నావు. అంటువ్యాధి అని ఎంతచెప్పినా వినేవాడివికావు.

షెల్లీ : అంటే కోపంగాని, మిత్రుడు కీట్సు దుఃఖంలో ఆనందించడం బాగా అలవరచుకొన్నాడు. అందుకుతోడు "ఎండిమియాన్" కావ్యంమీద శరపరంపరలగా వచ్చిన విమర్శలకు తట్టుకోలేకపోవడం, ఫేనీ వియోగాన్ని భరించ లేకపోవడం కూడా కలిసివచ్చి దౌర్బల్యానికి దౌర్బల్యం జతై, క్షయవ్యాధి అంకురించి కీట్సుని తీసుకుపోతోంది. (కళ్ళు చెమ్మగిళ్ళుతాయి.)

కీట్సు : (వినపడీ వినపడనట్లు) మిత్రులు ఈ విషయంలో పొరబడుతున్నారు.

బైరన్ : కీట్సు మిత్రమా! మోసాన్ని ప్రేమగా గ్రహిస్తున్నావు. లోకాన్నంతా మోహదృక్పథం నుంచి చూస్తున్నావు. ఫేనీ నిన్ను మోసగించింది. రుచు లాస్వాదించే ఫేనీ బ్రాన్‌కి మహాకవివైన నీవు సామాన్యుడివిగా కనపడ్డావు. నీ తమ్ముడు గండికొట్టిపోయిన దుఃఖసాగరానికి అనంతమేర్పరచిపోయింది. మహాకవీ! సమకాలికల్లో అనంత గౌరవానికి పాత్రుడవైన నీ ప్రతిభలో భవిష్యత్తు అభ్యుదయానికి పురోగమిస్తుంది.

షెల్లీ : స్నేహానికి హృదయమిచ్చిన కీట్సు మిత్రమా! అన్యాయాల్లో, మోసాల్లో, అష్టకష్టాల్లో, వెలుగుల్లో, చీకటిలో, మోదఖేదాల్లో సానలుదీరిన నీ ప్రతిభ మాకు మార్గదర్శి. నీ జీవితం ప్రేమజీవులకు ఒక పాఠం!

కీట్సు : థామస్ తమ్ముడు నన్ను పిలుస్తున్నాడు; ఫేనీ నన్నుండమంటోంది. ఉండను; పోతాను. ఫేనీ! ఫేనీ!! నీవు నన్ను మోసంచేయలేదు.

బైరన్ : మిత్రమా! ఉద్రేకం పొందకు.

కీట్సు : (ఆవేశంతో) నా జీవితం మూడు దుఃఖపూరితరంగాలు: ఒకటి: సోదర వియోగం; రెండు: ప్రేయసి వియోగం; మూడు: నా అనంత యాత్ర. (కళ్ళు తేలవేసి జీవితయాత్ర ముగిస్తాడు.)

షెల్లీ : (గొంతు పెకలని స్థితిలో దుఃఖిస్తుంటాడు.)

బైరన్ : (కన్నీరు కార్చుతూ) మహాకవిని మబ్బులు మ్రింగేశాయి; చీకటులు తినేశాయి. కీట్సు మహాకవి మిత్రుడు జీవితయాత్ర చాలించిన ఈ క్షణం విశ్వమే దీర్ఘ నిశ్వాసం విడిచినట్లుగా ఉంది.

షెల్లీ : మిగిలింది: కీట్సు మధుర కవితాయశస్సు; అసంపూర్ణ "హైపరియాన్" కావ్యం!

అదృశ్యవాణి :

"ఆఁగు మాఁగుము తెరువరీ, ఆ
యాస ఖేదము నపనయింపుము,
మా గృహాంగణ కుసుమ సముదయ
మధువు లియ్యవిగో!"

—దీర్ఘ నిశ్వాసం—

△



# = దృక్పథాలు =

## * నవీన కథల సంపుటి *

జీవనమార్గంలో తటస్థించే సమస్యలను ఏ కోణంనుండి సమీక్షించాలి? ఎలా పరిష్కరించాలి? చక్కటి ఆత్మవిమర్శతో సరిఅయిన దృక్పథాన్ని అలవర్చే నవీన కథల సంపుటి.


రచయిత:

డాక్టరు రాంబాబు

ఏలూరు.

# నా మాట

దుఃఖదగ్ధ పరిపీడితులపై
సుధాశీకరాల్ చిలకాలీ;
చిలకాలీ, చిలకాలీ ఇక
జీవితాలనే నిలుపాలీ !!!

1950 జనవరిలో "నిట్టూర్పు" ప్రథమ ప్రచురణ చేసి నప్పుడు పాఠకులతో మాట్లాడడానికి నా గొంతుక పెకలలేదు. నాటికి కొన్నేళ్ళుగా సోదర వియోగ కారణంగా నిరంతరం దుఃఖదగ్ధ హృదయంతో వున్న నేను "నిట్టూర్పు" ను నా తమ్మునికి అంకిత మిచ్చి కొంత సంతృప్తిచెందాను.

తెలుగులో విషాదాంత నాటికల సంపుటి ప్రచురించడం "నిట్టూర్పు" ఏడు విషాదాంత నాటికల సంపుటితోనే మొదలు! ఇది నామాట కాదు; అనేకమంది ప్రముఖులు, పత్రికలు ప్రశంసించిన విషయం.

"నిట్టూర్పు" ప్రథమ ప్రచురణ అయిన తర్వాత అనేక విమర్శలు, వ్యాఖ్యలు, సూచనలు, ప్రశంసలు, సమీక్షలు నేటికీ వస్తున్నాయి. వీటి నన్నిటినీ చాలాసార్లు పర్యావలోకనం చేశాను. విమర్శనలయందు నాకున్న గౌరవం అపరిమితం. విమర్శన ఆత్మ పరిశోధన చేయించి సత్యోన్ముఖులను చేయగలదని విశ్వసిస్తాను; అయితే చేయాలని పనిపెట్టుకొనిచేసే విమర్శలు చాలా వక్రమార్గంలో వుంటాయి. అందుకనే చాలావాటిని విమర్శలుగా లెక్కించడానికి వీలులేదు. అంతేగాక తెలుగులో విమర్శన ఇంకా విశాల దృక్పథంతో వెలువడాలని అంతా ఆశించాలి.

ప్రముఖులంపిన కొన్ని అభిప్రాయాలు, పత్రికలువ్రాసిన కొన్ని సమీక్షలు యిందు పొందుపరుస్తున్నాను. ఇదివరకు నా నాటికలను విమర్శించినవారికీ, నా నాటికలగూర్చి సందేహా లున్నవారికీ అవే సమాధానం చెప్పగలవని ఆశిస్తున్నాను. అయితే సద్విమర్శను నే నెల్లప్పుడూ ఆహ్వానిస్తాను. తప్పులు దిద్దుకొని సరిఅయిన దృక్పథంలో ఉండడానికి సర్వదా సంసిద్ధుడనే !

"నిట్టూర్పు" లోని కొన్ని నాటికలు యిదివరకు కొన్ని పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. ఆ పత్రికల అధిపతులకు నా అభివందనాలు!

"నిట్టూర్పు" రచన, ప్రచురణ, విషయంలో శ్రద్ధ, సహకారం చూపిన మిత్రులకు నా వందనాలు !!

"నిట్టూర్పు" ప్రథమప్రచురణకు అత్యంత ఆదరణనుచూపిన పాఠకలోకానికి నా కృతజ్ఞత! ఈ ద్వితీయ ప్రచురణనుకూడా ఆదరించగలరని నమ్ముతున్నాను.

"నిట్టూర్పు" చదివినవారి హృదయాల్లో దుఃఖదగ్ధ జీవులపై ఏమాత్రం ఆర్ద్రతకల్గినా నా కృషి ఫలించినట్లే !!!

లోకంలో శాంతి, ప్రగతి
ఆనందం, అమర జీవనం
పూరితమై, పొంగిపొర్లే
భవిష్యత్తు నిర్మించా లిక !!!

ఏలూరు,
1950 జూన్.

డాక్టరు రాంబాబు.

# ప్రముఖుల ప్రశంసలలో
# సంపాదకుల సమీక్షలలో

# • నిట్టూర్పు •

△ ఏడు విషాదాంత నాటికల సంపుటి △

రచయిత :

డాక్టరు రాంబాబు
ఏలూరు.

★

ఆర్యా! అభివాదం.

మీ 'నిట్టూర్పు' కావ్యాన్ని సాంతంగా చదివి సంతోషించాను. నిస్సహాయ నిర్భాగ్యవ్యక్తుల తప్తహృదయాల్తో కరగి కన్నీరయ్యే మీ సదయహృదయం, ప్రత్యక్షరంలో, ప్రతిశబ్దంలో శబ్దిస్తుంది! "అగ్నిగుండం-రక్తసముద్రం!" "దీపస్తంభం ఊగులాడుతోంది!" అను శీర్షికలుగల కథాఖండాలు నన్నెక్కువగా ఆకర్షించాయి. మీ ఉపజ్ఞ తుజ్జీలేదు. ఆర్ద్రమైన మీ కలం కఠిన కర్కశలోకాన్ని కరగించే ప్రజాకావ్యసృష్టి చేసి మిక్కిలి యుపకరిస్తుందని ఆశిస్తున్నాను.

భవదీయుడు:

• జీ. జాషువ; గుంటూరు.

అమాత్యా!

మీ "నిట్టూర్పు" వల్ల విశ్వమానవుని నిమ్నస్తరం దుమ్ముతోలగి తళతళా కనిపిస్తోంది. విషాదం మధ్యబిందువుగా గల యీ నిట్టూర్పు సహృదయుల హృదయాన్ని ఒక బిందువుగా ద్రవింపజేస్తుంది.

• వేలూరి శివరామశాస్త్రి; సూరవరం.

మహాశయా !

"నిట్టూర్పు" లోని నాటికలన్నీ ఆసక్తితో చదివాను. సామాన్య జీవితాంశమును తీసుకొని చిన్న నాటికలలో మీరు హృదయంగమముగా చిత్రించినారు. ప్రతి నాటికలోని కథాసన్నివేశమూ, విషాదముగొలిపి నిట్టూర్పు విడిపించేదే. నేటి లోకవృత్తం యీ నాటికలలో అద్దంలోలాగా ప్రతిఫలింపజేశారు. మీ రచనలో జీవముంది ; వేడి వుంది...శోషించి నీరవము, నిస్తేజము అయిన జీవనవాహినికి అమృతవృష్టి కురిసి ఆశలు చిగిరింపజేయండి. మీకు నా ఆశీస్సులు.

• మల్లంపల్లి సోమశేఖరశర్మ ; మద్రాసు.

రాంబాబుగారూ !

మీ నాటికలు హృదయ రుధిరముతో వ్రాసినట్లుండి పట్టి కుదుపుతున్నాయి.

• శ్రీపాద గోపాలకృష్ణమూర్తి ; మద్రాసు.

రాంబాబుగార్కి—

మీ "నిట్టూర్పు" చదివాను. గొప్ప విషయాలు తీసుకున్నారు ; నాటకాలకి. చాలా శ్రద్ధగా శ్రమపడి వ్రాశారు.

• గుడిపాటి వెంకటచలం ; విజయవాడ.

శ్రీ రాంబాబుగారికి వందనాలు.

మీ "నిట్టూర్పు" చదివాను. నాటికలలో మీకు పాత్రలతోగల సానుభూతి బాగా కనిపిస్తున్నది. కవిహృదయంతో వ్రాశారు. సెలవు !

• మీ, కొడవటిగంటి కుటుంబరావు ; మద్రాసు.

Dear Doctor !

నాటికలు చక్కనివి. వీటి విశిష్టత – మాటిగా హృదయానికి తాకగల శక్తి ! ఈ శక్తి ఎంతో వుంది మీ కావ్యంలో ! సెలవు !

• రామచంద్ర అప్పారావు ; నూజివీడు.

డాక్టరుగారికి నమస్కారాలు !

మీ నాటికలలో భావసాపటిమ ప్రశంసనీయం.

• నార్ల వెంకటేశ్వరరావు ; మద్రాసు.

పూజ్యమిత్రులు; రాంబాబుగారి సన్నిధికి నమస్కృతులు.

మిత్రరత్నమా !

మీ అమూల్య నాటికల సంపుటిని ఎన్నోసార్లు చదివాను. అనుభవించాను; ఆనందించాను. మీ "నిట్టూర్పు"- కాదు, కాదు. మీరు రచించిన "నిట్టూర్పు" నిజంగా - మానవుని - నిత్యజీవితంలోని అనుభవాల "కూర్పు!" మీ రచనలోని ఆ భాషా "సొంపు", నాటికలలో పాత్రల పోషణలోని ఆ "ఇంపు", తెలుగు సారస్వతానికి ఒక అమూల్యమైన "కెంపు", మీ ఆశయసిద్ధికై కళామూర్తియైన ఆ సర్వేశ్వరుని కృప ఎల్లప్పుడూ మీ "వైపు".

ఇట్లు మీ "దృక్పథాల" కెదురుచూస్తున్న మీ సోదర కళా "కాపు"

వి. నాగయ్య, కోయంబత్తూరు "క్యాంపు".

నమస్తే; భవదీయుడు:

• వి. నాగయ్య; కోయంబత్తూరు.

శ్రీయుత రాంబాబుగారికి.

"నిట్టూర్పు" లోని ఏడు నాటికలూ రత్నపేటికల్లా వున్నాయి. రచయిత మానవజీవితంయొక్క లోతుల్లో యీది అసంతృప్తికరమైన ఈ మానవజీవితంలో అద్దరి కనుపించక అలసిపోయి ఒక్క నిట్టూర్పు కొక్కొక్క నాటిక ఊహించారనిపిస్తుంది. అంతేకాదు. - కొన్నిచోట్ల మానవజీవితంలోవుండే నగ్నసత్యాన్ని ఎంతో అందంగా చిత్రించారు. "నిట్టూర్పు" ఒక క్రొత్తపోకడలో ఉంది.

• పి. భానుమతి : మద్రాసు.

... క్షయవ్యాధికి గురియైన సోదరుడు ప్రేమకు దూరమైన ప్రేయసి స్థితికి భంగముకల్గించే వ్యాధి అయినా కవి రససిద్ధుడు అయేడు. అనుభూతి ప్రతిభకు మెరుగు పెట్టింది. అతడి ప్రతిభ కష్టాలకు గాకదీరింది యీ యేడు విషాదాంత నాటికలు... విషాద నాటికలు లేవనే అఘాతాన్ని పూర్తిచేస్తుంది.

• ఎ. నరసింహారావు, ఆల్ ఇండియా రేడియో; విజయవాడ.

... They are well written and can easily be adapted for stage purposes.

• **The Indian Express; Madras.**

... "Nittoorpu" can be classed as one of the best dramatic compositions in Modern Telugu literature.

• **Indian Republic: Madras.**

"నిట్టూర్పు" పీడితప్రజాకోటిని అనుదినం యెదుర్కొంటున్న సమస్యలు యితివృత్తంగాకల విషాదాంత నాటికల సంపుటి. కుక్కలకన్నా కార్మికులను నీచంగా చూచే ధనికుల చిత్తప్రవృత్తిని చిత్రించే "పాల దొంగలు"; భిక్షుకుల దినచర్యను ఆధారంగా తీసుకొని పోలీసు, పచ్చి బ్లాక్ మార్కెటీరుల దౌష్ట్యాన్ని వర్ణించే "దీప స్తంభం ఊగులాడుతోంది!" అన్న నాటికలు హృదయాన్ని కదలించివేసేరీతిని రచించారు నాటకకర్త. అన్ని నాటికలలోను సమయోచితంగా గేయాలను కూర్చడం గమనార్హం. సాంఘిక సమస్యలపై యిట్టి నాటికలను విరచించి ప్రచురించడం ముదావహం !!

• ఆంధ్రప్రభ ; మద్రాసు.

నాటికలన్నీ భావప్రధానమైనవి.

ఆంధ్రపత్రిక ; మద్రాసు.

"నిట్టూర్పు" ఏడు విషాదాంత నాటికల సంపుటి. చక్కని భావాన్ని తెలియజేసే ముఖచిత్రంతో వెలువడినది. ఏడు విషాద జీవిత ఘట్టాలను తీసికొని రచయిత చక్కని భావాలను, చక్కని భాషనూ ఉపయోగించి వ్రాశారు. రచయిత ప్రతినాటికలోను ప్రేయసీప్రేమ, కళాసేవ, వేదాంతం, సోదరప్రేమ, ధనికవర్గానికి లోనై పేదలు పడే బాధలు, కామానికి లొంగి, విపత్తులు తెచ్చుకొన్న మానవుల జీవితం మొదలైన చక్కని సమస్యలను తీసుకొని నాటికలను తయారుచేశారు. చక్కని నాటికలను యీ విధంగానే రచించి ప్రచురిస్తే యెంతో మంచిది. రాంబాబుగారికి మా అభినందనాలు!

• ఆంధ్ర మహిళ ; మద్రాసు.

విషాదాంతాలనే ప్రచురించడం తెలుగులో క్రొత్త ప్రయత్నం. మెచ్చుకోతగ్గదే!

• ఆనందవాణి ; మద్రాసు.

"నిట్టూర్పు" లోని అన్ని నాటికలూ భావస్ఫూరితంగా వుండి రచనలు చదివిన తరవాత పాఠకులలో భావోద్రేకం వుత్పలిస్తోంది. ఓ కావ్యాన్ని ఆంధ్రప్రజానీకానికి అందించిన శ్రీ రాంబాబుగారు అభినందనీయులు. ఇలాంటి అభ్యుదయరచనలే యింకనూ రావాలని మనవాంఛ!

• నవజీవన ; మద్రాసు.

"నిట్టూర్పు" పేరు వింటేనే చాలు; ఓ బాధాకరమైన విషయంగా ఇట్టే తట్టుతూంది; మహావేదనతో నిండిన హృదయాలమధ్యనుంచి వెలువడే దీర్ఘనిశ్వాసలే - యువరచయిత నిర్మలహృదయ మధ్యంలోచేరి, కలతబెట్టి, సుళ్లుతిరిగి, "నిట్టూర్పు" రూపంలో ఏడు విషాదాంతనాటికలుగా వెలువరింపజేసినై. నిజంగా డాక్టరు రాంబాబు నాటికారచనతో, అనేక నిర్భాగ్యుల హృదయాలలోని లోతులు కొలిచిచూపి, సంఘానికి కనువిప్పు కలిగించేందుకు చేతనైనంతవరకు ప్రయత్నించారనే తెల్లమౌతోంది, ప్రతి నాటికనూ చదివిచూస్తే!... ఉప్పొంగే హృదయోద్రేకంలో, మహావేదనలోనే ప్రతినాటికలోని రచనాసాగిపోయింది. ప్రతినాటికా చదువుతో ఉంటే హృదయం జలదరిస్తుంది. తప్పక ప్రతివారూ చదువవలసిన పుస్తకమిది!

• ఉష : ఏలూరు.

మానవుని జీవితంలోని మరువరానివి, ఇతరుల మనస్సులలో కరుణారసబీజములను వెదజల్లేవి విషాదాంత ఘట్టాలు. అందుకే డాక్టరు రాంబాబుగారు చదువరుల మనస్సును కరిగించి, కష్టపరంపరలలో తగుల్కొని బాధపడే నిర్భాగ్యజీవులయెడ దయ చూపించాలన్న పాఠాన్ని బోధించాలనే ఉద్దేశ్యంతో విషాదాంత నాటికలు వ్రాశారని తోస్తుంది. ఇందులకు "నిట్టూర్పు" లోని నాటికలన్నీ తార్కాణం! "అగ్ని గుండం–రక్త సముద్రం!" అన్న నాటికలో డాక్టరు రాంబాబుగారు అఖండ ప్రత్యేకత చూపించారు. అది చదివితేనేగాని బోధపడదు. ఈ ఏడు విషాదాంత నాటికల సంపుటికి "నిట్టూర్పు" అని పేరుపెట్టడం రచయితయొక్క ప్రజ్ఞను చూపుతోంది. "ఎర్ర తెర నిప్పులు క్రక్కుతూ వ్రాలుతుంది", "నల్ల తెర రోదిస్తూ జారుతుంది" అని నాటకరంగములను ముగించడంలో నూతనప్రత్యేకత వుంది. భాష చాలా మృదువుగాను, సందర్భానికి సరిపోయేటట్లు వుంది.

• మార్గదర్శి ; పూనా.

శ్రమజీవుల జీవితాలలోని కష్టపరంపరను ప్రతిఫలింపజేసే అద్దమువంటిది యీ "నిట్టూర్పు" నాటికల సంపుటి అనడంలో అతిశయోక్తిలేదు. కష్టజీవులయెడ కరుణ కలిగించుటయే యీ నాటికల ప్రధాన లక్ష్యంగా కనబడుతుంది. నాటికల రచనలో, భావంలో రాంబాబుగారు ప్రత్యేకతను ప్రదర్శించారు. "అగ్ని గుండం–రక్తసముద్రం!" అనే నాటికలో అద్భుత సన్నివేశ కల్పనము, భావవిశిష్టత ప్రదర్శించారు. ఇక ప్రదర్శకులు యిచ్చిన సూచనలలో భావానుగుణముగానుండే రంగుతెరలు వాడవలెననే రచయిత అభిప్రాయము కొనియాడతగినది.

• ప్రారంభవిద్య ; ఏలూరు.

డాక్టరు రాంబాబుగారు తెలుగు పాఠకులకు చిరపరిచితులే! ప్రతి రచనలో వారి సహజ ప్రత్యేకత తొణికిసలాడుతూన్నది. వీరి నాటికలలో ఉపయోగించి, రంగు తెరలు రసపుష్టికి తోడ్పడుతున్నాయి.

• వినోదిని ; మద్రాసు

"నిట్టూర్పు" ఏడు విషాదాంత నాటికల సంపుటి. ట్రాజడీలను ఆంధ్రులు స్వీకరించినట్టు మరేదేశస్థులు అందుకోరనుకుంటాను. ఏడు చిన్న నాటికలను వ్రాసి ఆంధ్ర పాఠకలోకానికి డాక్టరు శ్రీ రాంబాబుగారు అందించారు. చక్కని గెటప్; భావగర్భితమైన సంభాషణలు. ప్రతివారు తప్పక చదువవలసిన పుస్తకం. ప్రతి వెల : పన్నెండణాలు. కావలసినవారు—డాక్టరు రాంబాబు, ఏలూరు ; పశ్చిమగోదావరి జిల్లాకు వ్రాయండి!

పెంకిపిల్ల ; మద్రాసు.


ఆధునికాంధ్ర నాటక కళాసరస్వతికి
అమూల్యమైన కానుక !

△ నిట్టూర్పు △

సంపాదకుల, సమీక్షలలో, ప్రముఖుల ప్రశంసలలో, నటీనటుల అభిప్రాయాలలో, యావదాంధ్ర ప్రజానీకం వేయివిధాల పొగడిన ఏడు విషాదాంత నాటికల సంపుటి.

ద్వితీయ ప్రచురణ వెలువడింది.

మూల్యం : ముప్పావలా.
తపాలాఖర్చులు : అరణాలు.
వి. పి. పి. పద్ధతి లేదు.

రచయిత :
డాక్టరు రాంబాబు.
ఏలూరు.

# "NITTOORPU"

VOLUME OF SEVEN

PATHOTIC PLAYS

**IN TELUGU**

Price : TWELVE ANNAS.

*By* :-

**Dr. RAM BABU**

ELURU, S. India.